Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

అభ్యాసం

పంపినవారు :
సి. సూర్యరావు - గొల్లప్రోలు

# ఒక బహుమతిని గెలవండి.

## తప్పులను గుర్తించండి!

### తప్పులు ఎక్కడున్నవి?

గోవింద్, అచ్చుపని నేర్చుకుంటున్న బాలుడు, అధిక చిక్కుపాలయ్యాడు. అతడు అతి తొందరగా కొన్ని బినాకా చిత్రాలను ముద్రించుటకు ఆజ్ఞాపించబడ్డాడు. కాని పని పూర్తవగానే, మేనేజరు చాలా ఆగ్రహపడ్డాడు, గోవింద్, అనేక తప్పులుచేశాడు. అతని తప్పులను గుర్తించుటకు మీరు గోవిందుకు సాయపడతారా? గోవింద్ యొక్క పని నమూనాలో ప్రతి తప్పుచుట్టూ సున్నా గీయండి, ఉదాహరణగా ఇలాంటివి:

'TO(O)THPASTE' 'GRE(A)N'



ఎంట్రీ కూపన్‌లో మీరు గుర్తించిన తప్పుల సంఖ్యనుకూడా సూచించండి. రంగునుగాని లేక చిత్రాన్నిగాని మీరు దిద్దనక్కర్లేదు.

మొదటి బహుమతి: రిస్టువాచి - ఒమేగా, కన్‌స్టిల్లేషన్, అఫిషియల్లి సర్టిఫైడ్. సెల్ఫ్‌వైండింగ్ క్రానామిటర్, ఆల్‌ప్రూఫ్. (ఖరీదు రు. 690/-)

రెండవ బహుమతి: రిస్టువాచి - ఒమేగా, సీమాస్టర్ క్యాలెండర్, ఆల్‌ప్రూఫ్, సెల్ఫ్‌వైండింగ్, ఏకకాలమందే తారీకును, కాలమును తెలుపును. (రు. 500/-)

మూడవ బహుమతి: రిస్టువాచి - ఒమేగా, సీమాస్టర్, సూపర్ వాటర్ ప్రైట్. సెల్ఫ్‌వైండింగ్ వాచి, దాని ఖచితానికి 30,000 కన్నా ఎక్కువమంది విమాన పైలట్లచే ఎన్నుకోబడ్డది. (రు. 450/-)

తదుపరి 12 బహుమతులు: ఆగ్‌ఫా క్లిక్ కెమేరాలు. (రు. 29/- ఒక్కొక్కటి)

తదుపరి 12 బహుమతులు: బేడ్మింటన్ రేకెట్లు, హాకీ స్టిక్‌లు 1 కి (రు. 10/-)

తదుపరి 12 బహుమతులు: పెయింట్ బాక్సులు, (కుంచెలుసహా) (రు. 7-8/- ఒక్కొక్కటి)

తదుపరి 500 బహుమతులు: "పాలీథైనర్" ప్రయాణపు నీటి సీసాలు, (రు. 5/ ఒక్కొక్కటి)

తదుపరి 5000 బహుమతులు: "ది ట్రెజర్ హంట్" ఒక క్రొత్త ఇంటిలోని ఆట, మరియు, పోటీదారులందరికీ: క్రొత్త (1955) బినాకా, స్కూల్ టైంటేబిల్.



ఫౌన్‌టెన్ కలములకు,
సిరాలకు
జగత్ప్రసిద్ధి పొందిన
పేరు

## పైలట్

మరల ఇప్పుడు
భారతదేశములో
ప్రతి చోట
లభించుచున్నవి

*

నాణ్యమునకు
పూచీ

MANUFACTURED BY

**THE PILOT PEN CO. (INDIA) LTD.**

CATHOLIC CENTRE, MADRAS-1.



## డోంగ్రేగారి

### బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టినిచ్చి, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

**K. T. Dongre & Co., Ltd., BOMBAY-4**




## ఆంధ్రుల చరిత్ర సంస్కృతి

ప్రతి ఆంధ్రుడు చదువ దగిన సద్గ్రంథము. ఆంధ్ర రాష్ట్ర సాధనకు మిక్కిలి తోడ్పడిన గ్రంథము.

పే. 500. వెల రు. 6 0 0




### బాలసరస్వతి పిక్టోరియల్ మీడియం డిక్షనరి

(ఇంగ్లీషు—ఇంగ్లీషు—తెలుగు)

విద్యకు, విజ్ఞానానికి, పరీక్షలో విజయానికి ఈ డిక్షనరీ వుపయోగపడుతుంది. 1000 పేజీలు. పూర్తిక్యాలికో బైండు

| | |
|---|---|
| మీడియం ధర | 9 0 0 |
| జెం డిక్షనరీ ధర | 4 8 0 |




## గానకళాబోధిని

అపూర్వ సంగీత గ్రంథము. గొప్ప అనుభవజ్ఞులచే రచింపబడినది. సంగీతము నేర్చుకొనుటకు, సాధనకు, పరీక్షలకు పిన్నలకు పెద్దల కుపయుక్తపడు గ్రంథరాజము.

పే. 1000. రు. 10 0 0

తమ ఆర్డరుతోపాటు అడ్వాన్సు పంపగలరు.

**వలయువారు: బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు.**

బ్రాంచి:— నెం. 6, సుంకురామచెట్టి వీధి, మద్రాసు.

## చందాదారులకు మనవి



పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లైయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లైయింట్లు గమనించబడవు.

మేనేజరు




# పెర్టుసిన్

"టెష్నర్"




అరవై సంవత్సరములపైనుంచి అన్ని విధములయిన దగ్గులతో, కోరింతదగ్గుతోసహా, బాధపడుచున్న వారికి, పెర్టుసిన్ త్వరితముగాను, క్షేమముగాను స్వస్థత చేకూర్చినది. పెర్టుసిన్ కొనుడు!

అందరు కెమిస్టుల వద్దను లభించును

ఎటెఫా లిమిటెడ్, షాన్ లీచ్‌టెన్‌స్టెయిన్. స్విస్ కస్టమ్ అండ్ ఎకనామిక్ టెరిటరీ వారితో చేసుకున్న ఒడంబడిక ప్రకారము, యిండియాలో

**ఇన్‌ఫా లిమిటెడ్, పోస్టు ఆఫీసు బాక్సు నెం. 1041, బొంబాయి-1 వారిచే తయారయినది.**

ILY-7-TEL

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

అసమానమైన శక్తియుక్తులనూ, ప్రజ్ఞా ప్రాభవాలనూ ప్రదర్శించిన మహామేధావులకు పుట్టినిల్లు మనదేశం. తెనాలిరామ కాళిదాసాది కవిపుంగవులూ, తిమ్మరుసు వీరబలులవంటి మహా మంత్రులూ—మార్గదర్శకమైన ఉత్తమశ్రేణికి చెందినవారు. అట్టివారి ప్రతిభను ఏకాలమందు ఎన్నిసార్లు ప్రస్తుతించినా ఎప్పటికప్పుడు అంతులేని ఆనందము కలుగుతూనే వుంటుంది. అందుచేతనే వారినిగురించిన చరిత్రలు అమరగాథలుగా వెలసి ఉన్నవి, అవి కలకాలమూ నిలిచి ఉంటవి. అనుశ్రుతాలైన అటువంటి చక్కటి జాతీయ గాథలను మన చందమామలో కొత్త వెలుగుతో చిత్రించి, అందించడానికి కుతూహలపడుతున్నాము. అపూర్వములైన ఈ కథల సేకరణలో పాఠకులు పాల్గొంటారని ఆశిస్తాము.



ఏప్రిల్ 1955

సంపుటి 16
సంచిక 4

# నక్కబావ—తోడేలు

వయసు మళ్లినా
సత్తు వుడిగినా
చేజిక్కన అధికారం
వదలలేని దుర్వ్యసనం!

నాడివేడి చల్లబడీ
వాడియెల్ల వడిలిపోయి
ముదిమిచేత మూలనొదిగి
మదమణగిన మగసింగం,

"అడవినెల్ల యేలకలుగు
వేడి మరల కలిగించే






ఔషధమెదొ కొనిర"మ్మని
శాసించెను జంతువులను.

అజ్ఞలు నెరవేర్చుట యే
ప్రజ్ఞకదా దాసులకును!
వెదకి వెదకి ఏమందునొ
ప్రతి మృగమూ తెసాగెను.

నక్కబావగా రొకరే
పక్క వదలకున్న జూచి
"పూర్వపగలు తీరనిదే
తరి"యని తోడేలుగారు

నంగనాచిమాట లెవో
సింగము చెవి వేయగానె





( గేయ కథ )

నాడి నాడి వేడికలిగి
పడుచుతనమె వచ్చె 'నని
అమ్మతల్లి చెప్పె" ననుచు
హుమ్మని సింహమ్ము లేచి
చీల్చివేసె తోడేలును
పీల్చివేసె ఆ నెత్తురు.

మీరు మనే రాజ్యం బహు
ఘోరం; క్షమ అచట లేదు!
ఈసు నసూయలు సాగవు!
దాసులు! తస్మాత్ జాగ్రత!

"భర్జించెద నక్క" ననుచు
గర్జించెను సింహమపుడు.

ఏనుగొకటి గునగున చని
ఆ నక్కను కొనిరాగా
తన శత్రువు తోడేలని
క్షణములోనె కనిపెట్టి,

నక్క వినయ ముట్టిపడగ
బిక్కమొగము వేసుకొని
"మిమ్ము కాచు రక్షకొరకె
అమ్మవారిక్క మ్రొక్కవస్తి;

'తోడేల్ నెత్తురు పీలిచి
తోడేల్ తోల్ కప్పుకొనిన



# అట్టమీది బొమ్మ

తన సోదరులను విడిచివెళ్ళిన అర్జునుడు పరమేశ్వరుణ్ణీ, దేవేంద్రుణ్ణీ మెప్పించి అనేకమైన వరాలు పొంది, చాలా కాలానికి తిరిగివచ్చాడు. అప్పుడు పంచపాండవులు అత్యంత ఉత్సాహంతో, హిమవత్ప్రాంతంలో సంచారం చేయసాగారు.

ఇలా వుండగా, ఒకనాడు—ఎక్కడికో వెళ్ళిన భీమసేనుడు ఎంతకూ రాకపోవడంతో యుధిష్ఠిరుడికి ఆత్రం కలిగింది. కొన్ని అపశకునాలు కనబడటం చేత ఆయన ఆత్రం మరింత ఎక్కువైంది. ఇక ఉండబట్టలేక, ధర్మరాజు స్వయంగా బయల్దేరి తమ్ముడిజాడ కనిపెడుతూ వెళ్ళాడు.

కొంతదూరంలో భీముడు విడిచే నిశ్వాసాలధ్వని స్పష్టంగా వినబడింది. అక్కడికి పోయి చూడగా—

భీకరస్వరూపం గల ఒక గొప్ప కొండచిలువ భీమసేనుణ్ణి బంధించి వుండటం కనబడింది. అది సామాన్యమైందికాదని ధర్మరాజు వెంటనే గ్రహించాడు. విచారింపగా, ఆ చిలువ ఇలా చెప్పింది: 'ఇది నా ప్రదేశం. ఇక్కడికి వచ్చినవాళ్ళని తినే హక్కు నాకున్నది. ఐతే—నే నడిగే ప్రశ్నలకు సరైన జవాబులు చెప్పగలవాళ్ళనుమాత్రం విడిచిపెడతాను; అప్పుడే నాకు శాపవిముక్తి' అంటూ, తన చరిత అంతా వివరించింది.

పూర్వం చంద్రవంశంలో నహుషుడనే రాజుండేవాడు. అతడు ఘన కార్యాలు చేసి, ఇంద్రపదవి గడించాడు. మహర్షులే వచ్చి అతడికి పల్లకిపట్టారు. అప్పుడు నహుషుడు గర్వంచేత 'ఇంత నిదానమేమిటి! చరచరా పొండి!' అని ఋషులను హెచ్చరించాడు. అప్పుడు అగస్త్యుడు కోపగించి 'నీవు సర్పమై పోదువుగాక!' అని శపించాడు.

నహుషుడు పశ్చాత్తాపపడి, మహర్షిని క్షమాపణ వేడుకొన్నాడు. అందుకు అగస్త్యుడు 'నీవు అడిగే ధర్మసూక్ష్మమైన ప్రశ్నలకు జవాబివ్వగలవారు వచ్చినప్పుడు వారివల్ల నీకు శాపవిమోచన కలుగుతుంది. అంతవరకూ జవాబులు చెప్పలేనివాళ్ళ నందర్నీ భక్షిస్తూ కాలక్షేపం చెయ్యి' అని చెప్పాడు.

ఆ చిలువరూపంలో వున్న నహుషుడి ప్రశ్నలకు, ధర్మరాజు సరైన సమాధానాలు యివ్వటంతో అతడికి శాపవిముక్తి కలిగింది. భీమసేనుడు విముక్తుడయ్యాడు.




కళింగరాజ్యంలో అనేకమైన గొప్ప నగరాలుండేవి. అందులో 'దాంతిపుర'మనే నగరానికి ప్రభువు కళింగు. అతనికి పెద్ద కళింగు, చిన్నకళింగు అని ఇద్దరు కొడుకులు. వీరి జాతకాలు పరిశీలించిన దైవజ్ఞులు ఇలా చెప్పారు:

'తండ్రి తదనంతరం పెద్దవాడే రాజ్యానికి వస్తాడు. చిన్నవాడిదిమాత్రం చిత్రమైన జాతకం. అతని జీవితమంతా సన్యాసియోగమే. కాని, మహారాజయోగం గల అదృష్టవంతుడు కుమారుడుగా పుడతాడు!'

కొద్దికాలానికే రాజు కళింగు కాలం చేశాడు. జ్యేష్ఠుడు సింహాసనమధిష్ఠించాడు. చిన్నవాడికి రాజప్రతినిధి పదవి వచ్చింది. తనకు కలగబోయే కుమారుడు మహారాజు కాబోతాడని జ్యోతిష్కులు చెప్పిన మాట చిన్నకళింగుకు బాగా మనసుకి పట్టింది. ఈ ధీమాతో అతడు అన్నకు లొంగివుండక స్వతంత్రుడుగా వ్యవహరింపసాగాడు. ఉభయులమధ్యా కలతలు ప్రారంభమైనై. రాజు చిన్నవాణ్ణి బంధించమని ఆజ్ఞాపించాడు

అదే కాలమందు బోధిసత్త్వుడు అవతరించి, కళింగరాజ్య మంత్రులలో ఒకడుగా ఉంటూవచ్చాడు. పెద్ద-కళింగుతరంనాటికి అతడు బాగా వృద్ధుడయ్యాడు. కుటుంబక్షేమం కోరిన ఆ వృద్ధమంత్రి చిన్నకళింగు వద్దకు వచ్చి. రహస్యంగా రాజాజ్ఞను వెల్లడించాడు. రానున్న అవమానాన్ని తలపోశాడు చిన్నవాడు.

"తాతా!— అన్నివిధాలా నాకు నీవే హితుడవు. ఆనాడు జ్యోతిష్కులు చెప్పిన మాటలు నీకుతెలుసుకదా!—అవి ఫలించడమే నిజమైతే నా కోరిక నెరవేర్చవలసిన బాధ్యత నీపై వున్నది. ఇడిగో—నా పేరుగల ఉంగరం, నా శాలువ, నా ఖడ్గం—



ఈ మూడూ ఎవరైతే నీవద్దకు తెచ్చి అనవాలు చూపిస్తాడో, వాడే నా కొడుకని గుర్తుంచుకో. నీచేతనైన సహాయంకూడా చెయ్యి," అని చెప్పి రెండవకంటికి తెలియకుండా అరణ్యాల్లోకి పారిపోయాడు.

* * *

మగధరాజుకు లేకలేక ఒక కుమార్తె కలిగింది. ఈమెజాతకం చూసిన జ్యోతిష్కులు "ఇది ఒక చిత్రమైన జాతకం. రాజకుమారి జీవితం ఒక సన్యాసినిగా గడుపుతుంది. ఐతే—ఆమెకు మహారాజయోగం గల ఒక కుమారుడు పుడతాడు" అని చెప్పారు.

ఈ వర్తమానం తెలియగానే సామంతరాజులందరూ రాజపుత్రిని పెళ్ళాడాలని వచ్చి పోటీలుపడసాగారు. రాజుకు గట్టి చిక్కే వచ్చింది. వీరిలో తన కూతుర్ని ఏ ఒకరికి ఇచ్చినా తక్కినవారు కక్షగట్టి పగతీర్చుకోవడం సహజం. కనుక, ఈ అపాయంనుండి తప్పించుకోడానికి నిశ్చయించాడు. గత్యంతరం లేక భార్యనూ, కూతుర్నీ వెంటబెట్టుకుని మారువేషంతో అరణ్యాల్లోకి పలాయనమయ్యాడు.

నదీతీరాన సదుపాయమైన జాగాలో ఒక చిన్న కుటీరం నిర్మించుకుని అందులో ముగ్గురూ కాలక్షేపంచేస్తూ వచ్చారు. వీరి కుటీరానికి కొంచెం ఎగువనే కళింగరాజపుత్రుని కుటీరం ఉన్నది.

ఒకరోజున—కుమార్తెను కుటీరంలో వదలి, మగధరాజదంపతులు కందమూలఫలాదులకోసం వెళ్ళారు. వారు వెళ్ళిన సమయంలో రాజపుత్రి రకరకాల పువ్వులు పోగుచేసి ఒక చక్కని దండ కట్టింది.

కుటీరంపక్కనే గంగఒడ్డున ఒక గున్నమామిడిచెట్టు వుంది. మగధ రాజపుత్రి ఆ చెట్టెక్కి కొమ్మల్లో కూర్చుని తను కట్టిన పువ్వులదండను అక్కడినుండి నీటిలో పడవేసి, వేడుక చూస్తున్నది.



అ పుష్పాలదండ తేలి అడుతూ పోయి పోయి, స్నానంచేస్తున్న చిన్న కళింగు తలకు తాకింది. గప్పున అతడు దానిని తీసిచూచి, "ఎంత చక్కటి పూలదండ!—ఎన్నిరకాల పుష్పాలు! దీనిని ఇంత ఇంపుగా సొంపుగా కూర్చినామె అపురూపమైన అందకత్తె ఐవుండాలె. ఈ మహారణ్యంలో ఇటువంటి సుందరికి పనియేమిటో?—" అని ఎన్నో విధాల ఆలోచించాడు. దండకట్టిన సుందరిని వెతికిపట్టాలని అతని మనస్సు ఉరకలు వేయసాగింది.

ఈ సంకల్పంతో కళింగు దీక్షపట్టిపోతూ వుండగా, ఒక దిక్కునుండి వీనులవిందు చేసే తీయని కంఠస్వరం వినవచ్చింది. అట్టె నిలబడి అటుఇటు చూడగా మామిడి చెట్టుకొమ్మల్లో కూర్చొని పాడుతున్న సుందరి కనిపించింది.

రాజపుత్రిని చూసి, కళింగు పరవశుడై, ఆమెతో కుశలప్రశ్నలు ప్రారంభించాడు. చివరకు, ఆమెను తన భార్యగా చేసుకోవాలనే ఉద్దేశం వెల్లడించాడు. అందుకామె "మీరు ఋషిసంతతికి చెందినవారు, మేము క్షత్రియులం," అన్నది.

వెంటనే కళింగు "నేనూ క్షత్రియుణ్ణే," అంటూ తన గుట్టుమట్టులన్నీ విప్పి చెప్పాడు. అప్పుడు రాజకుమారి తమ



పరిస్థితులుకూడా దాపరికం లేకుండా చెప్పవేసింది.

ఇద్దరూ కలిసి ఆమె తండ్రివద్దకు వెళ్ల గానే, సంగతి సందర్భాలు తెలుసుకొని "ఇతడే అమ్మాయికి తగిన వరుడు," అని మగధరాజు నిశ్చయించాడు. చిన్నకళింగుకీ, మగధరాజపుత్రికీ వివాహం జరిగింది.

కొద్దికాలానికే వారికి ఒక కుమారుడు కలిగాడు. గొప్ప లక్షణాలతో ప్రకాశించే ఆ బిడ్డడికి 'విజయకళింగు' అని పేరు పెట్టి, అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు.

కొన్నాళ్లు గడిచిన తరవాత ఒకరోజున, కళింగు జాతకాలు తీసి, లెక్కవేసి గ్రహ కూటాలు ఎలావున్నదీ చూచాడు. అప్ప టికి తన అన్నఐన పెదకళింగు అయువు మూడివుంటుందని లెక్కలవల్ల తేలింది.

అప్పుడు కళింగు కొడుకును చేరబిలిచి, 'కుమారా!—నీవు జీవితం గడపవలసింది ఈ అడవులలో కాదు. నా అన్న పెద్దకళింగు దాంతిపుర ప్రభువు. ఆ రాజ్యానికి వారసుడవు నీవే. కనుక, వెంటనే వెళ్ళి ఆ సింహాసనం అధిష్ఠించు' అనిచెప్పి, వృద్ధ మంత్రి పరిచయం చేసి, మూడు వస్తువులూ అన వాలిచ్చి దీవించి పంపాడు.

తలిదండ్రులవద్దా, తాతా అమ్మమ్మల వద్దా సెలవుతీసుకున్న విజయకళింగు దాంతిపురం చేరుకుని, వృద్ధ మంత్రిని దర్శించి, 'నేను ఫలానా' అని చెప్పాడు.

అప్పటికి, చిన్నకళింగు అంచనా ప్రకారం అతని అన్న కాలంచేశాడు; దాంతిపురం అరాచక స్థితిలో వున్నది.

ఒక మహాసభ ఏర్పాటుచేసి వృద్ధమంత్రి చిన్నవాడైన విజయకళింగు పుట్టుపూర్వోత్తరాలు వెల్లడించేసరికి సభికులందరూ ఆశ్చర్య భరితులై జేజేలు కొట్టారు.

వృద్ధమంత్రిఐన బోధిసత్వుడి సలహాలు పాటిస్తూ, విజయకళింగు చక్కగా రాజ్యం పరిపాలించి, పెద్దలపేరు నిలబెట్టాడు.



# కాలిన కట్టెలు



భోజరాజు కవి పండితులను సత్కరిస్తూ ధారానగరంలో పరిపాలన సాగించే కాలంలో మాళవదేశంలో అతి పేద బ్రాహ్మణుడొక డుండేవాడు. ఆ బ్రాహ్మణుడికి కవిత్వం రాదు, పాండిత్యంకూడా లేదు. అందుచేత భోజరాజు సన్మానించే అవకాశం లేదు. అయితే తనవంటివారికి సయితం కాళిదాసు తలుచుకుంటే, ఏదోవిధంగా సత్కారం జరుగుతున్నదని విని ఆ బ్రాహ్మణుడు కాలినడకను ధారానగరం చేరి కాళిదాసు దర్శనం చేసుకున్నాడు. కాళిదాసు ఆ బ్రాహ్మణుడి దుస్థితిగురించి విని, "అయ్యా నీవు మౌనవ్రతం ధరించి రేపు రాజసభకు రా. వట్టిచేతులతో కాకుండా ఏదో ఒక కానుక పట్టుకువచ్చి రాజుకియ్యి. నీ అదృష్టం బాగుంటే ఏదైనా ముట్టేటట్లు ప్రయత్నిస్తాను," అని సలహా ఇచ్చాడు.

ఆ బ్రాహ్మణుడు ఈ సలహా విని సంతోషించి, ఎక్కడో ఒక చెరుకుగడ సంపాదించి, దాన్ని తుండ్లుగా నరికి తన కొల్లాయి గుడ్డలో మూటగట్టుకున్నాడు. ఆ రాత్రి సత్రంలో భోజనంచేసి, మూట దగ్గిర పెట్టుకుని సత్రం ముందున్న చెట్టుకింద దుప్పటి పరుచుకు పడుకుని నిద్రపోయాడు.

ఆ సత్రం ఊరికి ఒక పక్కగా వున్నది. ప్రతి రాత్రీ అక్కడ విశ్రమించేందుకూ, వీలైతే ఉచితంగా భోజనం సంపాయించేందుకూ అనేకులు వస్తూవుండేవాళ్ళు. ఆ సత్రాన్ని అంటిపెట్టుకుని వుంటూ, అదమరిచి నిద్రపోయే వాళ్ళ వస్తువుల్నీ, డబ్బునూ సంగ్రహించే ఒక తుంటరి కుర్రవాడు వుండేవాడు.

కె. కాంతారావు

బ్రాహ్మణుడి మూటలో చెరుకుతుండ్లు ఉన్నట్టు కనిపెట్టిన ఆ తుంటరికుర్రాడు, బ్రాహ్మణుడు నిద్రపోతున్న సమయంలో మూట విప్పి, చెరుకుముక్కలు తీసుకుని, వాటికి బదులుగా కాల్చి ఆర్పిన కట్టెపుల్లలు నాలుగు కొల్లాయిగుడ్డలో మూటగట్టి తన దారిన తాను పోయాడు.

ఈ మోసం తెలుసుకోకుండానే పేద బ్రాహ్మణుడు మర్నాడు ఉదయం లేచి, కాలకృత్యాలు తీర్చుకుని సరాసరి రాజ సభకు వెళ్ళాడు.

కాళిదాసాది కవిపండితులతోసహా నిండు కొలువులో కూర్చునిఉన్న భోజరాజుతో ద్వారపాలకులు, "మహాప్రభూ! తమ దర్శనార్థం మౌనవ్రతుడైన ఒక బ్రాహ్మణుడు వచ్చి ఉన్నాడు," అని విన్నవించారు. రాజు ఆ బ్రాహ్మణ్ణి లోపల ప్రవేశపెట్టమని ఉత్తరువు చేశాడు.

బ్రాహ్మణుడు సభలోకి వచ్చి, మూట విప్పి అందులోని కాలిన కట్టెపుల్లలను రాజుఎదుట పెట్టాడు. వాటిని చూడగానే బ్రాహ్మణుడికి పైప్రాణాలుపైనే పోయినంత పని జరిగింది. సభికులంతా ఆ వింతకు విరగబడి నవ్వారు.

రాజుకు మాత్రం పట్టరాని ఆగ్రహం వచ్చి, "దీని అర్థమేమిటి?" అని అడిగాడు.



అందరూ మౌనంగా ఉన్న ఆ తరుణంలో కాళిదాసు లేచి :

"ప్రభూ! ఇందులో గొప్ప గూఢార్థం ఉన్నది. సెలవైతే చెప్పగలను," అన్నాడు.

"ఏమిటది?" అన్నాడురాజు ఆశ్చర్యంతో. కాళిదాసు ఈవిధంగా చెప్పాడు:

దగ్ధం ఖాండవ మర్జునేన చ వృథా
దివ్యద్రుమైర్ భూషితం,
దగ్ధా వాయుసుతేన హేమరచితా
లంకాపురీ స్వర్గభూః,
దగ్ధస్సర్వ సుఖాస్పదశ్చ మదనో
హా! హా!! వృథా శంభునా
దారిద్ర్యం ఘనతాపదం భువి నృణాం
కేనాపి నో దహ్యతే.

"దివ్యమైన వృక్షాలు గల ఖాండవ వనాన్ని అర్జునుడు అకారణంగా దహించాడు. స్వర్గాన్ని మరిపించగల లంకాపట్టణాన్ని హనుమంతుడు నిష్కారణంగా దహించివేశాడు. అందరికీ సుఖం చేకూర్చే మన్మథుణ్ణి మహాశివుడు నిర్దయగా దహించాడు. కాని మానవులను పీడించే దారిద్ర్యాన్ని ఏ మహానుభావుడూ దహించడే! ఆ పనికి మీరైనా పూనుకోరాదా అని ఈ బ్రాహ్మణుడు మీకు హెచ్చరికచేస్తున్నాడు."

ఇది విని రాజు చాలా సంతోషించి, బ్రాహ్మణుణ్ణి ఘనంగా బహూకరించాడు.

తాను చేసిన పనికి దండన తప్పదని భయపడ్డాడు బ్రాహ్మణుడు. కాని గొప్ప సన్మానం జరిగింది. తన కళ్ళను తానే నమ్మలేక వెనక్కు తిరిగిచూసుకుంటూ సభనుంచి వెళ్ళిపోయాడు.

"ఆబ్రాహ్మణుడలా వెనకవెనక చూస్తూ పోవటానికేమి కారణం?" అని రాజు కాళిదాసు నడిగాడు.

"మీరు దగ్ధంచేసిన దరిద్రదేవత మళ్ళీ తన వెంట రావటం లేదుగదా అని ఆ బ్రాహ్మణుడి భయం," అని యుక్తిగా కాళిదాసు జవాబుచెప్పాడు.





# వాకిలి దూరని లడ్డు

ఒకనాడు ఒక మనిషి వీధివెంట దోస కాయల బస్తా నెత్తిన పెట్టుకుని అమ్ము కుంటూ వచ్చాడు. పనిలేని పాపయ్య ఒకడు ఎదురుపడి, దోసకాయల మనిషిని నిలవేసి, అర్థంలేని ప్రశ్నలు వేయసాగాడు. దోసకాయల మనిషి, "కొనే బేరం కాదు, పెట్టే బేరం కాదు, పోవయ్యా!" అన్నాడు.

పాపయ్యకు పౌరుషం వచ్చింది.

"మన సంగతి తెలీడల్లేవుంది. బేరం తేల్చు, ఆ బస్తాడు దోసకాయలూ తినేస్తాను," అన్నాడు పనిలేని పాపయ్య.

"నీవంటివాళ్లని నలుగుర్ని వెంట తెచ్చుకున్నా కూడా నీవల్ల కాదు. పోవయ్యా, పో," అన్నాడు దోసకాయల మనిషి.

"పందెం వెయ్యి," అన్నాడు పాపయ్య.

"నువ్వీ దోసకాయలన్నీ తిన్నావే, నీకు వాకిలి దూరనంత లడ్డు పెట్టిస్తా," అన్నాడు దోసకాయల మనిషి.

"పెట్టించలేవు. పదిరూపాయల పందెం!" అన్నాడు పనిలేని పాపయ్య.

"నువ్వీ దోసకాయలన్నీ తిన్నప్పటి మాటకద!" అన్నాడు దోసకాయల మనిషి.

"బస్తా దించు," అని పనిలేని పాపయ్య బస్తాలో వున్న ఒక్కొక్క దోసకాయే కొంచెం కొంచెం కొరికి ఉమ్మేశాడు.

"ఏం, పరాచకమా?" అన్నాడు దోసకాయలవాడు.

"పరాచకమేమిటి? నీ దోసకాయలన్నీ తినేశాను" అన్నాడు పనిలేని పాపయ్య.

"ఇదేనా తినటమంటే?" అన్నాడు దోసకాయల మనిషి.

"ఎవరికైనా అమ్మజూపు, ఏమంటారో తెలుస్తుంది," అన్నాడు పనిలేని పాపయ్య.

ఈపాటికి చుట్టూ జనం మూగారు. ఆ కాయలన్నీ తినేసిన కాయలేనని వాళ్ళూ ఒప్పుకున్నారు. చేసేదిలేక దోసకాయల

వి. లోకనాథం

వాడు తన గోతం తీసుకుని వెళ్ళిపో బోయాడు. కాని పనిలేని పాపయ్య అడ్డు తగిలి, "లడ్డు మాటేమిటి? దానికూడా పందెం కాశాను మరి," అన్నాడు.

"వాకిలి దూరని లడ్డు ఆ మనిషి మాత్రం ఎక్కడ తెస్తాడు. పందెం ఓడి నందుకు ఓరూపాయి ఇస్తాడులే!" అని పక్కన వున్నవాళ్ళు అన్నారు.

"అదంతా కుదరదు. పదిరూపాయలూ కక్కతీరాలిసిందే!" అన్నాడు పాపయ్య.

"అయితే వాకిలి దూరలేని లడ్డు తెస్తాను-డు," అంటూ దోసకాయలమనిషి. పక్కనే వున్న మిఠాయికొట్టుకు వెళ్ళి అర్ధణాపెట్టి బెల్లం లడ్డు ఒకటి తెచ్చాడు.

"ఇదేనా వాకిలి దూరని లడ్డు?" అన్నాడు పనిలేని పాపయ్య వెటకారంగా.

"మరేమిటనుకున్నా నీయిష్టంవచ్చిన వాకిలి కోరుకో. దూరదని చూపిస్తాను," అన్నాడు దోసకాయల మనిషి.

అందరూ కలిసి పక్కనే వున్న యింటి వాకిలిదగ్గిరికి వెళ్ళారు. దోసకాయలమనిషి లడ్డును గడప అవతల పెట్టి, "దూరు!" అన్నాడు. లడ్డు కదలలేదు.

"చూశావా, వాకిలి దూరదు!" అన్నాడు దోసకాయలవాడు.

ఆమాటతో పనిలేని పాపయ్యకు గంగ వెర్రు లెత్తినై.

చుట్టూ ఉన్నవాళ్లంతా "ఆమనిషి చెప్పింది నిజమే," అన్నారు.

"అంటే సరి!" అని గొణుకుతూ పని లేని పాపయ్య జారుకోబోయాడు. దోస కాయలవాడు అడ్డొచ్చి "పందెం ఓడావు. పదిరూపాయలూ అక్కడపెట్టిపో!" అన్నాడు.

పనిలేని పాపయ్య ఆట కట్టింది. పది రూపాయలూ ఇచ్చేశాడు.

"దోసకాయలు పోతే పోయాయిగాని లేచిన వేళ మంచిదే!" అనుకుంటూ దోస కాయలవాడు ఇంటికి వెళ్ళిపోయాడు.





# మంచికలా-పీడకలా

పూర్వం ఒకదేశంలో ఒక ధనికుడుండేవాడు. అతను గొప్ప లోభి. పెళ్ళిచేసుకుని పిల్లల్ని కంటే వాళ్ళు తన డబ్బంతా పంచుకుపోతారనే భయంతో బ్రహ్మచారిగా జీవిస్తూ, వంటచెయ్యటానికి మాత్రం ఒక నౌకరును పెట్టుకున్నాడు. తను కడుపు నిండా తినేవాడుకాడు, నౌకరునూ తిననిచ్చేవాడుకాడు.

ఇలా ఉండగా సంవత్సరాది పండుగ వచ్చింది. నౌకరు యజమానికి తెలియకుండా రకరకాల పిండివంటలు తనకూ, యజమానికీసరిపోయేటట్టుచేశాడు. భోజనం ముందు కూచుని ఈ పిండివంటలన్నీ చూసేసరికి యజమానికి గుండె పగిలి, "ఎందుకురా ఇవన్నీచేశావు?" అని అడిగాడు.

"ఉగాది పండగకదండీ? ఏడాదికి ఒక రోజైనా కడుపునిండా భోజనంచేద్దాం," అన్నాడు నౌకరు.

"నిజమే, నిజమే," అంటూ యజమాని చేసిన వంటలో ముప్పాతికకు పైగా బలవంతాన తినేశాడు. అంత రుచిగల పదార్థాలు తాను తినకపోతే తన నౌకరు తినేస్తాడని అయన బెంగ!

అంత ఎక్కితొక్కి తిన్నా జిలేబీ వంటకం ఒకటి మిగిలిపోయింది. యజమాని పరిస్థితి చూడబోతే అయన పొట్టలో ఇంక వాముపోచ పట్టే సందుకూడా లేదు. అందుచేత, ఆ జిలేబీకాస్తా నౌకరు తినకుండా చూడాలనే ఉద్దేశంతో యజమాని, "ఒరే, ఈ జిలేబీ రాత్రికిగాని పాకంలో బాగా ఊరదు. రాత్రిదాకా దాన్ని తాకమాకు, ఏం?" అన్నాడు.

"చిత్తం. రాత్రికే తిందాంలెండి," అన్నాడు నౌకరు.

కాని పగలు తిన్నతిండితో యజమానికి రాత్రికికూడా ఆకలి కాలేదు. అందుకని

అబ్దుల్ అలీం

ఆయన నౌకరుతో, "ఒరే, ఈ జిలేబీ మనం ఈ పూటకూడా ముట్టుకోవద్దు. ఇవాళ సంవత్సరాదిగద. ఈరాత్రి మనిద్దరిలో ఎవరికి మంచికల వస్తే వాళ్ళకు రేపీ జిలేబీ బహుమానం. ఏం?" అన్నాడు.

"అలాగే కానివ్వండి," అన్నాడు నౌకరు.

ఈరాత్రికి ఆ జిలేబీ నౌకరు నోట పడకుండా చేస్తే రేపటికి తనకు కరకరా ఆకలి పుట్టుకొస్తుందనీ, మంచికల వచ్చినట్టు చెప్పి తానే ఆ జిలేబీ తినెయ్యవచ్చుననీ అనుకుని యజమాని వెళ్ళి పడుకుని నిద్రపోయాడు.

యజమాని గురక చెవిని పడగానే నౌకరు వంటఇంట్లోకి వెళ్ళి జిలేబీ యావత్తూ ఆరగించి, పాకం సాంతం తాగేసి తానుకూడా వెళ్లి పడుకున్నాడు.

మర్నాడు నిద్రలేచేసరికి యజమానికి మామూలుగానే ఆకలి అయినట్టు తోచింది. ఆయన నౌకరును పిలిచి, "ఏంరా, రాత్రి నీకేంకల వచ్చిందేమిటి?" అని అడిగాడు.

"ఎందుకడుగుతారులెండి? వట్టి పీడకల!" అన్నాడు నౌకరు.

యజమాని ఆనందించి, "నా కెంత గొప్పకల వచ్చిందనుకున్నావ్? రాజుగారు నాకు తన కుమార్తెనిచ్చి పెళ్ళిచేసి పట్టాభిషేకం చేశారుట. పక్కన దాసీలు వింజామరలు వీస్తున్నారు. కొలువు తీరిఉంది.



ఎదట నాట్యకత్తెలు నృత్యంచేస్తున్నారు. ఎంత వైభవంగా ఉందని! ఇంతకీ నీకు వచ్చిన కల చెప్పావుకావు," అన్నాడు.

నౌకరు దిగులు ముఖంపెట్టి, "అయ్యా, కన్నుమూశానో లేదో కాళికామ్మవారు గభీల్మని నా ఎదుటదూకి, సింహగర్జనలుచేస్తూ 'ఓరీ వంటఇంటో జిలేబీ వెంటనే తింటావా? పీక నులిపెయ్యనా?' అని అదరగొట్టింది.

"నాకు ముచ్చెమటలు పోశాయి. 'అమ్మా ఆ జిలేబీలు నేను తినగూడనివి. నా యజమానికీ నాకూ ఒక ఒప్పందం కుదిరింది. ఎవరికి మంచి కల వస్తే వారు ఉదయమే ఆ జిలేబీలు తినాలి. కనుక నన్ను బలవంతంచేయక వదిలిపెట్టు," అని ప్రార్థించాను.

"కాని కాళికామ్మవారు నన్ను వదలలేదు. 'వెంటనే వంట గదిలోకి వెళ్ళి జిలేబీలన్నీ ఈ క్షణమే తింటావా? లేక నిన్ను విరుచుకుని తినమంటావా?' అంటూ ఉగ్రురాలై మీదికి రాసాగింది. ప్రాణంమీది తీపికొందికీ వంటగదిలోకి వెళ్లి ఆ జిలేబీలని తినక తప్పిందికాదు," అన్నాడు.

యజమాని ఉగ్రుడై, 'కాళికామ్మవారు అంత గొడవచేస్తే, పక్క గదిలో నిద్రపోతూన్న నాకు కాస్తకూడా వినబడదా? అయినా నువ్వు ఒక్క కేక పెట్టివున్నట్టయితే నీ రక్షణకు వచ్చివుండేవాణ్ణి. పిలవకపోయినావ్రటా, దరిద్రుడా?" అన్నాడు.

నౌకరు నవ్వుతూ, "నా కామాత్రం తెలీదాండీ? నేను తమకోసం చూశాను. కాని తమరు ఎక్కడో పేరోలగంలో మంత్రుల మధ్య, పట్టపుదేవి పక్కన, నృత్యవినోదాలు చూస్తూ సింహాసనాసీనులై ఉంటిరి! నన్నా రాజభటులు రానిచ్చారా?" అన్నాడు.

యజమాని నౌకరు యుక్తికి సిగ్గుపడి తల వంచుకున్నాడు.

అనాటినుండీ యజమానీ నౌకరూకూడా కడుపునిండా తిండి తినసాగారు.






## 16

[వ్యాఘ్రదత్తుడి కంటబడకుండా తప్పించుకు పారిపోయిన సమరసేనుడు శిథిలనగరంలో దాక్కున్నాడు. అక్కడికి వ్యాఘ్రదత్తుడు తన భటులతో వచ్చాడు. శాక్తేయుడి అపూర్వ శక్తులు గల త్రిశూలం ఏనుగులవనంలోని గురుద్రోహి అస్థిపంజరంలో వున్నదని తెలిసింది. వ్యాఘ్రదత్తుడు సమరసేనుడు దాక్కున్న చోటును గుర్తించాడు. తరవాత—]

సమరసేనుడూ, సైనికులూ దాగివున్న ప్రదేశాన్ని వ్యాఘ్రదత్తుడు గుర్తించాడు. శిథిలభవనం స్తంభాలవెనక పొంచివున్న వాళ్లు శివదత్తుడూ, అతడి అనుచరులూ అయివుంటారన్న అనుమానం అతడికి కలిగింది. వాళ్లు ఎవరైనా ముందువాళ్ళను పట్టి బంధించాలి లేకపోతే ప్రమాదం అనుకున్నాడు వ్యాఘ్రదత్తుడు.

సమరసేనుడుకూడా రానున్న ప్రమాదాన్ని గుర్తించాడు. తనదగ్గర వున్న అరుగురు సైనికులతో వ్యాఘ్రదత్తుణ్ణి ఎదుర్కొనటం ఆత్మహత్యతో సమానమని అతడు నిర్ణయించుకున్నాడు. అలాంటి స్థితిలో తను చేయవలసింది, సాధ్యమయినంత తొందరగా పారిపోవటం.

వ్యాఘ్రదత్తుడి సైనికులు భయంకరంగా అరుస్తూ ఒక్కుమ్మడిగా సమరసేనుడు దాగివున్న శిథిలభవనంకేసి దూకారు. సమరసేనుడుకూడా సైనికులను హెచ్చరించి అక్కడినించి పారిపోసాగాడు.

అరుగురు సైనికులూ, సమరసేనుడూ ఒకవైపు; ఇరవైమంది భటులూ, వారి



నాయకుడైన వ్యాఘ్రదత్తుడూ ఒకవైపు— యిక ఆ ప్రదేశమంతా వాళ్ళ కేకలతో హెచ్చరికలతో మార్మోగిపోసాగింది.

శిథిలభవనాల్లోని గదులలో, గోడల చాటునా దాక్కుంటూ సమరసేనుడూ, సైనికులూ అక్కడినుంచి తప్పించుకో జూస్తున్నారు. కాని వ్యాఘ్రదత్తుడు తన భటులను రెండు ముఠాలుగా చేసి వాళ్లను చుట్టుముట్టేందుకు పురిగొల్పాడు.

విరిగిన స్తంభాలచాటునా, పడిపోయిన గోడలమాటునా పొంచివుండి బాగా దాపులకువచ్చిన వ్యాఘ్రదత్తుడి భటులను, సమరసేనుడూ, సైనికులూ ఎదుర్కొన



సాగారు. కొందరినైనా వ్యాఘ్రదత్తుడి భటులను హతమార్చందే తనూ సైనికులూ అక్కడినించి పారిపోగలగటం అసంభవమని సమరసేనుడు నిర్ణయించుకున్నాడు.

వ్యాఘ్రదత్తుడు తన భటులకు ధైర్యం చెబుతూ తనే సమరసేనుణ్ణి ఎదుర్కొ దలిచాడు. అప్పటికే వ్యాఘ్రదత్తుడి భటులలో నలుగురైదుగురు, సమరసేనుడి కత్తికి బలి అయిపోయారు.

ఎటుచూచినా కేకలూ, గాయాలు తిన్నవాళ్ళ మూలుగులూ ఆ ప్రదేశమంతా భీకరంగా వుంది. అటువంటి సమయంలో వ్యాఘ్రదత్తుడు ముందుకు దూకి సమరసేనుణ్ణి ఎదుర్కొన్నాడు.

అతి బలశాలురూ, ధైర్యవంతులూ అయిన సమరసేన—వ్యాఘ్రదత్తులమధ్య కత్తియుద్ధం ప్రారంభమైంది. వారి కాళ్ళ అదురుకూ, కత్తిదెబ్బలకూ శిథిలమైపోతూ ఒరిగివున్న స్తంభాలూ గోడలూ కిందపడసాగాయి. కిందపడుతూన్న వాటినుంచి పక్కకు తప్పుకుంటూ వాళ్ళిద్దరూ అతి భీకరంగా యుద్ధం చేయసాగారు.

పోరు కొంతసేపు జరిగేసరికి వ్యాఘ్రదత్తుడు క్రమంగా అలసట చెందాడు. ఇది గ్రహించిన సమరసేనుడు తన బలాన్నీ,



చాకచక్యాన్ని కూడగట్టుకుని అతణ్ణి హతమార్చేందుకు ముందుకురికాడు

ఈలోగా సంఖ్యలో రెట్టింపువున్న వ్యాఘ్రదత్తుడి భటులు సమరసేనుడి సైనికులను బంధించగలిగారు. సైనికులలో ఇద్దరు ముగ్గురు బాగా గాయపడిపోయారు. అవిఘ్నంగా సైనికులను బంధించిన వ్యాఘ్రదత్తుడి భటులు తమ నాయకుడికి సహాయపడేందుకు బయలుదేరారు. కోలాహలం అణగిపోవటం, తన సైనికుల కేకలు విన బడకపోవటంవల్ల సమరసేనుడు తన వారందరూ బంధింపబడటమో చంపబడటమో జరిగివుంటుందని గ్రహించాడు.

ఇక యిప్పుడు తను సాధ్యమైనంత శీఘ్రంగా వ్యాఘ్రదత్తుణ్ణి తుదముట్టించి అక్కడినుంచి పారిపోవాలి.

ఇలా ఆలోచించిన సమరసేనుడు రెట్టించిన ఉద్రేకంతో వ్యాఘ్రదత్తుడితో పోరసాగాడు. తనను వ్యాఘ్రదత్తుడి భటులు వెనకనుంచి ఎదుర్కోకుండా వుండేందుకు ఒక గోడనానుకుని సమరసేనుడు యుద్ధం చేస్తున్నాడు. కాని పాపం అతడికి తనానుకునివున్న గోడ శిథిలావస్థలో వున్నదనీ, విరిగి వెనక్కు పడిపోయేందుకు సిద్ధంగా వుందనీ తెలీదు. ముందుండి పోరాడుతున్న వ్యాఘ్రదత్తుడు ఈసంగతి గ్రహించాడు.






హఠాత్తుగా వ్యాఘ్రదత్తుడి భటుల కఠోర కంఠాలు ఒక్కసారిగా మార్మోగినై. వాళ్లు సమరసేనుడి సైనికులందరనూ బంధించి తమ నాయకుడికి సహాయపడేందుకు మూక ఉమ్మడిగా ముందుకు దూకుతున్నారు. రానున్న ప్రమాదాన్ని గుర్తించిన సమరసేనుడు తన కత్తితో వ్యాఘ్రదత్తుడిమీదికి ఒక్కసారి లంఘించి, గోడమీది నుంచి దూకేందుకు ఎగిరాడు.

సమరసేనుడు అలా గోడమీదికి ఎగిరేసరికి అసలే శిథిలమై కూలిపోయేందుకు సిద్ధంగా వున్న గోడ కాస్తా పెళపెళమంటూ ఒక్కసారి విరిగి వెనక్కు పడిపోయింది.



దానితోపాటు సమరసేనుడు అవతలవైపుకు పడి ఆ రాళ్లమధ్య చిక్కుకుపోయాడు.

వ్యాఘ్రదత్తుడికి యిది చక్కని అదను కలిగించింది. అతడు ఒక్కసారి విజయ ధ్వానం చేస్తూ సమరసేనుడిమీదికి ఉరికాడు. అంతలో అతడి భటులుకూడా వచ్చి సమరసేనుడి కాళ్లూ, చేతులు గట్టిగా పట్టుకుని కదలకుండా చేశారు.

వ్యాఘ్రదత్తుడు ఆజ్ఞాపించగానే సమరసేనుడి చేతులు తాళ్లతో బంధించబడినై. అతడి కత్తిని వ్యాఘ్రదత్తుడు స్వాధీన పరుచుకున్నాడు.

తన శత్రువు చేజిక్కడన్న సంతోషంతో వ్యాఘ్రదత్తుడు పరవశుడైపోయాడు. అతడు క్రూరంగా నవ్వుతూ :

"చివరికి ఎట్లా అయితేం నా చేతిలో చిక్కావు. మొదట నాకు తటస్థపడినప్పుడే నాతో రాజీపడివున్నట్టయితే నీకినాడు యీ దుర్గతి పట్టేదికాదు. శాక్తేయుడి అపూర్వ శక్తులు గల త్రిశూలం ఎక్కడున్నదీ నాకు తెలిసిపోయింది. నీకుమాత్రం దుర్మరణం తప్పదు!" అన్నాడు.

వ్యాఘ్రదత్తుడి మాటలకు సమరసేనుడు చలించలేదు. ఒకవేళ తనకు దుర్మరణమే తప్పనిసరైతే అందుకు అతడు సిద్ధంగానే





వున్నాడు. అతడికి అప్పట్లో తననుగురించి కన్న తన నాయకత్వాన్ని నమ్ముకుని కష్టాలపాలైన సైనికులను గురించే ఎక్కువ బాధ కలిగింది. సేనాని అయిన తను సైనికులకు సరైన నాయకత్వం యివ్వలేక పోయానా, అని అతడు ఆత్మపరీక్ష చేసుకొసాగాడు. ఆ కారణంవల్ల అతడు వ్యాఘ్రదత్తుడి మాటలను విననట్లే వూరుకున్నాడు.

కాని సమరసేనుడి మౌనాన్ని వ్యాఘ్రదత్తుడు మరోవిధంగా భావించాడు. నిబ్బరంగా, నిశ్చింతగా వున్న సమరసేనుడి వాలకం వ్యాఘ్రదత్తుణ్ని కలతపరిచింది. ఎవరి సహాయాన్నో అండగా చూసుకుని అతడు అలా నిర్భయంగా వున్నాడని వ్యాఘ్రదత్తుడు అనుమానించాడు.

"నీకీ కష్టదశలో సహాయపడగలవారెవరూ లేరు. ఆ సంగతి గుర్తుంచుకో," అన్నాడు వ్యాఘ్రదత్తుడు. అలా అంటే సమరసేనుడు తనకు సహాయపడగలవాళ్ల పేరు చెపుతాడని అతడి ఆశ.

వ్యాఘ్రదత్తుడి భయసందేహాలను నిశిత బుద్ధి అయిన సమరసేనుడు యిట్టే గ్రహించాడు. ఇదే అదనుగా అతణ్ని కొంత బెదిరించి చూస్తే తనకు మేలు కలగవచ్చునని అతడు వూహించాడు.



"శాక్తేయుడి త్రిశూలం ఎక్కడవున్నదీ తెలిసినది నీవొక్కడికే కాదు, ఆ సంగతి గుర్తుంచుకో. పైగా ఆ త్రిశూలం ఎక్కడ వున్నదీ తెలిసినంతమాత్రాన వుపయోగం ఏమీ లేదు," అన్నాడు సమరసేనుడు.

ఈ జవాబుతో వ్యాఘ్రదత్తుడు నివ్వెరపోయాడు. శాక్తేయుడి త్రిశూలం శిథిల నగరంలోని ఏనుగుల వనంలో వున్నదని శివదత్తుడికి తెలుసు. తను తన భటులకు చెపుతూండగా సమరసేనుడు కూడా చాటున వుండి విన్నాడు.

"త్రిశూలం ఎక్కడ వున్నదీ చాటున వుండి నీవు విన్నావని నాకు తెలుసు. శివ



దత్తుడికికూడా అది వున్న చోటు తెలుసు అయినా నీవూ అతడూకూడా నన్ను అడ్డగించగలిగిన స్థితిలో లేరు. అలాంటప్పుడు ఆ దివ్యశక్తులు గల త్రిశూలాన్ని నాచేత బడకుండా చేయగలవా రెవరు ?" అని వ్యాఘ్రదత్తుడు ప్రశ్నించాడు.

సమరసేనుడు ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండా వూరికే నవ్వి వూరుకున్నాడు. ఆ విధంగా వ్యాఘ్రదత్తుడిలో అనుమానాన్ని మరింత ఎక్కువచేయాలని సమరసేనుడి ప్రయత్నం. ఆ ప్రయత్నం ఫలిస్తుందనేందుకు సూచనగా వ్యాఘ్రదత్తుడి ముఖం వెలవెలపోవటం సమరసేనుడు గ్రహించాడు.

"త్రిశూలం నీచేత బడకుండా ఆటంకపరచగలవారు యిద్దరున్నారు. వారిలో ఒకణ్ణిమాత్రం ప్రస్తుతానికి బంధించగలిగావు. కాని ఆ త్రిశూలం నీకంట బడకముందే హతమార్చగలవాడు మరొకడున్నాడు. అతడు నాకు మిత్రుడు. అతడి అజ్ఞాపాలనకోసమే నేను నీ వ్యాఘ్రమండలానికి బయలుదేరాను. తెలిసిందా ?" అన్నాడు సమరసేనుడు.

వ్యాఘ్రదత్తుడు ఆ మాటలతో కలవరపాటు చెందాడు. తన విజయం అను



కొన్నంత తేలిక కాదని అతడికి సంశయం కలిగింది.

"నన్నాటంకపరచగల అత డెవరు ?" అని అడిగాడు వ్యాఘ్రదత్తుడు.

"చతుర్నేత్రుడు !" అని బిగ్గరగా జవాబిచ్చాడు సమరసేనుడు.

'చతుర్నేత్రుడు' అన్న వాక్యం వ్యాఘ్రదత్తుడిలోనే కాక అతడి భటుల్లోకూడా సంచలనం కలిగించింది. భటులు భయకంపితులై తమ నాయకునికేసి ఆదుర్దాగా చూడసాగారు. అది గమనించిన వ్యాఘ్రదత్తుడు లేని ఉత్సాహాన్నీ ధైర్యాన్నీ కనబరుస్తూ :





"అతణ్ణి నీ వెన్నుగుదువన్నమాట!" అంటూ నవ్వాడు.

"అతడి ఆజ్ఞాపాలనకే యిక్కడికి వచ్చాను ఆ సంగతి గుర్తుంచుకో!" అన్నాడు సమరసేనుడు.

వ్యాఘ్రదత్తుడు వణికిపోయాడు. చతుర్నేత్రుడినిగురించీ, అతడి శక్తియుక్తులనుగురించీ అతడు విన్నాడు.

ఇప్పుడేమి చేయుటమా అని వ్యాఘ్రదత్తుడు ఆలోచించేంతలో దూరంగా సైనికుల కోలాహలం వినబడింది. అంతలో ఒక భటుడు పరుగెత్తుకుంటూ వచ్చి "అయ్యా! శివదత్తుడు తన అనుచరులతో శిథిలనగరం ప్రవేశించాడు," అని చెప్పాడు.

వ్యాఘ్రదత్తుడికి నెత్తిన పిడుగుపడినట్లయింది. తనదగ్గిర వున్న కొద్దిమంది భటులతో శివదత్తుణ్ణి ఎదుర్కొవటమో లేక అక్కడినుంచి పలాయనంచేయుటమో తప్ప అతడికి మార్గాంతరం లేదు. కాని సమరసేనుణ్ణి ఏమిచేసేట్టు? ఆ క్షణంలోనే అతణ్ణి తుదముట్టించటం మంచిదని తోచినా అది ప్రమాదమని అతడికి భయం కలిగింది. తన మిత్రుడి మరణానికి కోపగించిన చతుర్నేత్రుడు మొత్తం వ్యాఘ్రమండలాన్నే నాశనంచేయగలడు.

"సమరసేనా- యిప్పటికీ, యింత జరిగినతరవాతకూడా మనిద్దరం రాజీపడటం నీకూ నాకూకూడా క్షేమమని భావిస్తున్నాను. ఆ రాజీమాట లేమిటో యిద్దరం తీరిగ్గా కూచుని చర్చించాలి. మనం ఇక్కడినుంచి మరో సురక్షితప్రదేశానికివెళదాం" అన్నాడు.

తరవాత నిరాయుధుడైన సమరసేనుణ్ణి వెంటబెట్టుకుని వ్యాఘ్రదత్తుడూ అతడి భటులూ అక్కడినుంచి త్వరగా పారిపోసాగారు. పారిపోతున్న వారికి దూరంగా శివదత్తుడి అనుచరులతో పోరు సల్పుతున్న వ్యాఘ్రదత్తుడి మిగిలిన భటుల అరుపులు వినబడుతున్నాయి. —[ ఇంకా వుంది ]





# విచిత్ర వివాహం

పూర్వం పాటలీపురంలో ఒక ధనవంతుడైన బ్రాహ్మణుడికి కేసటుడనే కుమారుడుండేవాడు. అతడు అసాధారణమైన అందచందాలు కలవాడు. యుక్తవయసు రాగానే అతనికి పెళ్ళాడాలనిపించింది. తనకు తగిన అందగత్తె ఎక్కడా కనపడనందున కేసటుడు, తీర్థయాత్రలు చేసి వస్తానని తలిదండ్రులతో చెప్పి కన్యాన్వేషణకు బయలుదేరాడు.

కేసటుడు చాలా రోజులు ప్రయాణంచేసి నర్మదా తీరం చేరాడు. ఆ సమయానికే అక్కడికి పెళ్ళివారి గుంపొకటి చేరింది. ఆ గుంపులోనుంచి ఒక ముసలి బ్రాహ్మణుడు, కేసటుడి అందచందాలను చూసి అతనిదగ్గిరికి వచ్చి:

"నాయనా, పెద్దవాణ్ణి, నా కొక్క సహాయం చేసిపెడుదూ!" అని ఎంతో దైన్యంగా అడిగాడు.

"చెప్పండి. నాచేతనైతే అలాగే చేస్తాను," అన్నాడు కేసటుడు.

"నా కీ సహాయం చేయటంవల్ల నీకేమీ నష్టం వుండదు. నా వంశంమాత్రం నిలబెట్టినవాడవవుతావు," అన్నాడు ముసలి బ్రాహ్మణుడు.

"నేనేంచెయ్యాలి?" అన్నాడు కేసటుడు.

"నర్మదకు అద్దరిని రత్నదత్తుడనే బ్రాహ్మణుడున్నాడు. ఆయనకు రూపవతి అనే కుమార్తె, చక్కని చుక్క, ఉన్నది. ఆ పిల్లను నా కొడుక్కు చేసుకోవటానికి పోతున్నాం. నా కొడుకునింకా వారు చూడలేదు. నువు ఎంత అందగాడివో, మావాడంత కురూపి. వాణ్ణి చూస్తే రత్నదత్తుడు పిల్లనివ్వడు. అందుచేత నువు నావెంట వస్తివా, నువే నా కొడుకువని చెబుతాను; నిన్నే పెళ్ళికొడుకును చేస్తాం; పిల్ల మెళ్ళో నువే తాళి కట్టు! పెళ్ళి అయిపోయాక నీ

వి. ప్రభాకరరావు



దారిన నువ్వు వెళ్ళు, నాదారిన నేను కోడల్ని తీసుకుపోతాను. నీ ఋణం ఉంచుకోనులే, బాబూ !" అన్నాడు బ్రాహ్మణుడు.

ఆ ముసలివాడి నీచత్వానికి కేసటుడు దిగ్భ్రమచెందాడు. కాని ముందుగా మాట ఇచ్చాడు కనక ముసలివాడు కోరినట్టు చెయ్యక తప్పిందికాదు. అతనుకూడా పెళ్ళిమూకలో చేరి పడవలమీద నది దాటి ఆ సాయంకాలమే పెళ్ళివారి ఊరుచేరాడు.

ఆ సాయంకాలం కేసటుడు కాల కృత్యాలు తీర్చుకునేటందుకు నదిదగ్గిరికి వెళ్ళేసరికి అతన్ని ఒక రాకసుడు పట్టుకుని తినబోయాడు. తాను ఒక బ్రాహ్మణుడికి సాయపడటానికి మాట ఇచ్చాననీ, ఆ పని పూర్తిచేసి మర్నాడు రాత్రి వస్తాననీ, అప్పుడు రాకసుడు తనను తినవచ్చుననీ కేసటుడు చెప్పాడు.

"ఆడితప్పవుగద?" అన్నాడు రాకసుడు అనుమానిస్తూ.

"ఆడితప్పను గనకనే దుర్మార్గుడైన ఆ బ్రాహ్మణుడికి సాయం చేస్తున్నాను," అన్నాడు కేసటుడు.

"సరే వెళ్ళిరా. నీ సత్యసంధత ఎట్టిదో చూస్తాం!" అన్నాడు రాకసుడు.

కేసటుణ్ణి పెళ్ళికొడుకును చేశారు. వివాహం సక్రమంగా జరిగిపోయింది. ఆ రాత్రి వధూవరులను గదిలోకి పంపారు. కాని కేసటుడు రూపవతికేసి చూడలేదు, ఆమెతో మాట్లాడలేదు. ఇంత అందగాడు తనకు భర్త అయినాడని సంతోషించిన రూపవతి, తన భర్తకు తనపై ఆగ్రహం కలిగిందనుకుని, ఏమి చెయ్యటానికీ తోచక నిద్రపోయేదానిలాగా కళ్ళు మూసుకుని పడుకుంది.

ఒక రాత్రివేళ కేసటుడు, రూపవతి గాఢనిద్రలో ఉన్నట్టు ఊహించి, మెల్లిగా గదినుంచి బయటికి వచ్చి, నదీతీరాన ఉన్న రాకసుడి దగ్గిరికి బయలుదేరాడు. ఇదంతా

గమనిస్తున్న రూపవతికూడా లేచి మేలి ముసుగు కప్పుకుని కేసటుణ్ణి కొంత మార్గంలో అనుసరించి నడవసాగింది.

కేసటుడు నడిదగ్గిరికి వచ్చేసరికి రాక్షసుడు కనిపించి :

"యువకుడా, భలే! అన్నమాట నిలబెట్టుకున్నావు. ఇంత సత్యసంధుడైన నిన్ను తిని నేను పవిత్రుణ్ణవుతాను!" అన్నాడు.

ఇది చూసి రూపవతి ముందుకు వచ్చి ఆక్రోశిస్తూ, "అయ్యో, ఆయన నా భర్త! వదిలిపెట్టు!" అన్నది.

"నా కాకలిగా ఉన్నది. నే నితన్ని తినేస్తాను." అన్నాడు రాక్షసుడు.

"నీ కాకలిగా ఉంటే నన్ను తిని ఆయనను విడిచిపెట్టు. ఆయనను భక్షించి నన్ను దిక్కులేనిదాన్నిచేస్తే నా గతి ఏంకాను?" అన్నది రూపవతి.

"నన్నేం చెయ్యమన్నావు? బిచ్చమెత్తుకో!" అన్నాడు రాక్షసుడు.

"అనాథనైపోతే నా కెవరు భిక్ష పెడతారు?" అన్నది రూపవతి.

"నువ్వడిగితే భిక్ష పెట్టనివాడు తల పగిలి చస్తాడు, సరేనా? ఇక వెళ్ళు!" అన్నాడు రాక్షసుడు.

"అయితే నిన్నే అడుగుతాను. నాకు పతిభిక్ష పెట్టు," అన్నది రూపవతి.








ఆమెనుచూసి రాక్షసుడికి చాలా ఆనందమయింది. "ఇదుగో, నీభర్త! తీసుకో! అతనికి తగ్గభార్యవే దొరికావు! మీ ఇద్దరూ నాలుగుకాలాలపాటు సుఖంగా ఉండండి" అని వాళ్ళిద్దరినీ దీవించి రాక్షసుడు చీకటిలో ఎటో వెళ్ళిపోయాడు.

రూపవతి పతిభక్తి చూసి కేసటుడికి ఎంతో ఆనందం కలిగింది. అయినా అతను ఆమెతో అసలు విషయం చెప్పలేదు. తెల్లవారేలోపుగా వారు ఇంటికి తిరిగివచ్చారు.

మర్నాడు భోజనాలు పెందలాడే ముగించి పెళ్ళివారు పెళ్ళికూతురితోసహా ఇంటికి తరలారు. కృతఘ్నుడైన ముసలి బ్రాహ్మణుడు, ఏరు దాటి తెప్ప తగలేసినట్టుగా, కేసటుడితో పని అయిపోయింది గనక అతనికి పెట్టిన నగలూ, వస్త్రాలూ లాక్కుని, తనవారినందరినీ ఒక పడవలో ఎక్కించి, మరొక పడవలో కేసటుణ్ణి ఎక్కించాడు. రెండోపడవవాళ్ళకి పుష్కలంగా డబ్బిచ్చి, నడియేట్లో పడవను ముంచెయ్యమనికూడా చెప్పాడు. నది దాటేటప్పుడు ముందుపడవ సవ్యంగా అవతలి ఒడ్డు చేరింది. వెనకపడవమాత్రం నట్టేట మునిగిపోయింది.

బాగా ఈదటం చేతనైన పడవవాళ్ళు మాత్రం ఈదుకుంటూ ఒడ్డుచేరారు.

ప్రవాహం బలంగా ఉండటంవల్ల కేసటుడెక్కిన పడవ మునిగికూడా చాలాదూరం కొట్టుకుపోయింది. కేసటుడు చావు తప్పి కన్నులొట్టపోయి ఏదోవిధంగా ఆ పడవలో నుంచి బయటపడి ఒడ్డు చేరుకోగలిగాడు. తనకు ముసలిబ్రాహణుడు చేసిన ద్రోహంకన్నా రూపవతికి దూరంకావటం కేసటుణ్ణి చాలా బాధించింది.

ఇక్కడ పెళ్ళివారివెంట నది దాటి కాలినడకను నడిచిపోతున్న రూపవతి ముసలి బ్రాహ్మణుడిదగ్గిరికి వెళ్ళి, వినయంగా:





"ఏమండీ, మిగిలినవారంతా నడుస్తున్నారు, ఆయనగారు మాత్రం ఎక్కడా కనిపించరేం?" అని అడిగింది.

"నీ భర్తేనా? ఇడుగో!" అంటూ ముసలిబ్రాహ్మణుడు కురూపి అయిన తన కుమారుణ్ణి చూపించాడు.

రూపవతికి పట్టరాని దుఃఖమూ, ఆగ్రహమూ వచ్చాయి.

"నా భర్త ఈయనా? ఇదేదో రాజుగారినే అడిగి తేలుస్తాను!" అన్నదామె.

పెళ్ళికూతురు నిజంగా అంతపనీ చేస్తే రాజుగారు తన తల తీయించేస్తారని ముసలివాడికి భయం పట్టుకుంది. అందుచేత ఆయన ఆ పిల్లను వెంటనే పుట్టింటికి పంపించేసి తనదారిన తాను వెళ్ళాడు.

రూపవతికి మాత్రం తను పుట్టిల్లు చేరానన్న సంతోషం ఏమీ లేకుండాపోయింది. ఆమె తన భర్తకోసం అహోరాత్రాలు పరితపించసాగింది. ఆయన సజీవుడో కాదో అన్న భయంకూడా ఆమెను పట్టుకున్నది. వృద్ధబ్రాహ్మణుడు తన భర్తకేమైనా కీడు కలిగించాడేమో అని ఆలోచించసాగింది.

ఈలోపుగా ప్రాణాలతో ప్రవాహంనుంచి బయటపడిన కేసటుడు, రూపవతికి జరిగిన అన్యాయంగురించి ఆమె తండ్రి అయిన రత్నదత్తుడితో చెప్పేసి, ఆ అన్యాయంలో తానుకూడా భాగం పంచుకున్నందుకు ప్రాయశ్చిత్తం చేసుకుందామని, కాలినడకను రూపవతి తండ్రి ఇల్లు చేరుకున్నాడు.

అక్కడ కేసటుడికి రూపవతి కనిపించగానే ఆతనికి ఎక్కడలేని ఆశ్చర్యమూ వేసింది. రూపవతికి కలిగిన ఆనందానికి మేరేలేదు. కేసటుడికి ఆ యింట అల్లుడికి జరగవలిసిన మర్యాద లన్నీ జరిగాయి.

కొంతకాలం అత్తవారింట ఉండి కేసటుడు రూపవతితోసహా పాటలీపురానికి తిరిగివెళ్ళిపోయాడు. అక్కడ చాలాకాలం వారు సుఖంగా జీవించారు.





# యుక్తిగల మంత్రి

పూర్వం అరేబియాలో ఒక సుల్తానుండే వాడు. ఆయన పరిపాలనపట్ల అశ్రద్ధ గల వాడై, ఎంతసేపూ తన స్వంత సుఖాలలో నిమగ్నుడై ఉండటంవల్ల రాజ్యమంతా దుస్థితికి వచ్చింది.

అధికారులు సోమరులైపోయారు. వృత్తి వ్యవసాయాలు నశించినై. ప్రజల జీవితం కళాకాంతులు లేకుండా పోయింది.

సుల్తాన్‌గారివద్ద చాలామంది మంత్రులుండేవారు. వారిలో కొందరు సుల్తాన్‌లాగే సుఖాలలో మునిగిపోయారు. మిగిలిన వారికి రాజ్యం పాడైపోతున్నదని విచారం ఉన్నప్పటికీ, ఏమైనా చెబితే సుల్తాన్ ఆగ్రహిస్తాడేమోనని భయపడ్డారు.

ఆఖరుకు మంత్రులలో ఒకడు సుల్తానుకు హెచ్చరిక చెయటానికి ఒక ఉపాయం ఆలోచించాడు. ఆయన ఒకనాటి సాయంకాలం సుల్తాన్‌వెంట తోటషికారుకు వెళ్ళాడు. చీకటి పడి వారు తిరిగి వచ్చే సమయంలో వారికి గుడ్లగూబల అరుపులు వినిపించాయి. అది వినగానే మంత్రి ఆగి శ్రద్ధగా ఆలకించసాగాడు.

"ఏమిటి వింటున్నావు ?" అని సుల్తాన్ ఆశ్చర్యంగా అడిగాడు.

"రెండు గుడ్లగూబలు మాట్లాడుకుంటున్నాయి, మహారాజా. వాటి సంభాషణ వింటున్నాను," అన్నాడు మంత్రి.

"నీకు గుడ్లగూబల భాష తెలుసునా యేమిటి ?" అన్నాడు సుల్తాన్.

"చిత్తం, మహాప్రభూ !" అంటూ మంత్రి కొంతసేపు ఆలకించి, "వీటి సంభాషణ ఇంక వినలేను ! నా చెవులలో సీసం కరిగించి పోసినట్టుగా వుంది. పదండి, మహారాజా !" అన్నాడు.

"అవి ఏవిషయం మాట్లాడుకుంటున్నా యేమిటి ?" అని అడిగాడు సుల్తాన్.

సి. బాలనారాయణశర్మ

"ఎందుకు కడుగుతారు, మహారాజా? బుద్ధిలేని పక్షులు! వాటి మాటలను లక్ష్యపెట్టవలసిన పనిలేదు," అన్నాడు మంత్రి.

"అవి ఆడే బుద్ధిలేని మాటలు నాకు కూడా చెప్పరాదా?" అన్నాడు సుల్తాన్.

"నేనే వినలేని ఘోరమైన అబద్ధాలు విని సహించగలరా?" అన్నాడు మంత్రి.

"అంతగా అయితే గుడ్లగూబలను దండించువాం. అవి అన్నమాట లేమిటో చెప్పు త్వరగా," అన్నాడు సులాన్.

"అయితే వినండి: ఆ గుడ్లగూబలు వియ్యమందుదా మనుకుంటున్నాయి. ఆడ గుడ్లగూబ తల్లిని మగదాని తల్లి కట్నం అడుగుతున్నది—తన కొడుక్కు యాభై పాడుబడిన గ్రామాలిమ్మంటున్నది. కావలిస్తే అయిదు వందల గ్రామాలిస్తానంటున్నది ఆడదాని తల్లి. పాడుబడిన గ్రామాలు అయిదు వందలు నీకెక్కడివని మగదానితల్లి అడుగుతున్నది. సుల్తాన్‌వారి చల్లని పరిపాలనలో పాడుబడిన గ్రామాలకు కొదువే లేదంటున్నది, ఆడ గుడ్లగూబ తల్లి," అన్నాడు మంత్రి.

సుల్తాన్ మరి నోరెత్తలేదు. రాజ్యం భ్రష్టయిపోతున్నదని మంత్రి తనకు తెలియజేయటానికై ఇదంతా కల్పించాడని సుల్తాన్ గ్రహించాడు.

ఇద్దరూ కొంతదూరం నడిచినాక మంత్రి, "ఇటువంటి అపవాదు వేసిన పాపిని దండించమని సెలవా, మహారాజా?" అన్నాడు.

"ఉన్నమాట అన్నందుకు దండన దేనికి? నిన్ను ప్రధాన మంత్రిగా వేస్తున్నాను. ఆ మగగుడ్లగూబకు కట్నం పుట్టకుండా చూడు!" అన్నాడు సుల్తాన్.

మర్నాటినుంచీ సుల్తాన్‌లో పెద్ద మార్పు కలిగింది. ఆయన తన భోగాలను కట్టిపెట్టి రాచకార్యాలు శ్రద్ధగా చూడసాగాడు. వ్యవసాయమూ, వివిధ వృత్తులూ వృద్ధిచెంది, రాజ్యం త్వరలోనే బాగుపడింది.






# ఆస్తి పంపకం

ఉజ్జయినికి దగ్గిరగల ఒక గ్రామంలో ఒక రెడ్డి ఉండేవాడు. ఆ రెడ్డి చుట్టుపక్కల గల తొమ్మిది గ్రామాలకు న్యాయాధికారి, సంపన్నుడు. ఆయనకు నలుగురు కుమాళ్లు. వారిలో పెద్దవాడు పెత్తందారుగా ఉండేవాడు. రెండోవాడు పశుపోషణా, మూడోవాడు వ్యవసాయమూ చూసుకునేవారు. నాలుగోవాడికి విద్యలో, దైవ కార్యాలు ధర్మకార్యాలు చేయటంలో ఆసక్తి హెచ్చు.

కొంతకాలం జరిగాక పెద్దరెడ్డి వృద్ధుడై మంచాన పడ్డాడు. ఆయన కుమాళ్లను పిలిపించి, "నాయన్లారా! ఇంతకాలమూ మనం ఒకరి తగాదాలు తీర్చాముగాని మన తగాదాలను ఇతరులదగ్గిరికి తీసుకుపోలేదు. నాకు కాలం సమీపించింది. మీరు నా మంచంకోళ్ళదగ్గిర మీ యిష్టానుసారం నిలబడండి. నేను పోయాక ఎవరి కోటివద్ద వారు తవ్వుకోండి. మీలోమీరు తగాదా మాత్రం పడవద్దు," అన్నాడు.

కుమాళ్ళు నలుగురూ నాలుగు కోళ్లవద్దా నిలబడ్డారు.

"నే చేయగలది ఇంకేమైనా ఉందా?" అని తండ్రి అడిగాడు. మరేమీ లేదని కుమాళ్ళు చెప్పినమీదట "నారాయణ, నారాయణ" అంటూ రెడ్డి నిశ్చింతగా ప్రాణం విడిచాడు.

తండ్రికి దినవారాలుచేసిన అనంతరం నలుగురు అన్నదమ్ములూ నాలుగు గునపాలు తెచ్చి, తండ్రి చెప్పినప్రకారం ఎవరి కోటివద్ద వారు తవ్వుకున్నారు. పెద్దవాడు తవ్వినచోట ఊక వచ్చింది. రెండోవాడు తవ్వినచోట పేడ వచ్చింది. మూడోవాడు తవ్వినచోట మట్టితప్ప మరేమీ రాలేదు. నాలుగోవాడు తవ్వినచోట మాత్రం వెండి బంగారాలు దొరికాయి.

ఎమ్. వీరరాఘవయ్య

ఇది చూసి మిగిలిన ముగ్గురన్నలకూ కోపం వచ్చింది.

"చూశారా? అఖరువాడన్న అభిమానం కొద్దీ ఎందుకూ పనికిరాని తమ్ముడికి వెండి బంగారాలిచ్చి మనకు ఊకా, పేడా, మట్టీ చూపించాడు మన తండ్రి," అనుకున్నారు పెద్దవాళ్ళు.

"ఎవరి ఇష్టంవచ్చిన కోటిడగ్గిర వాళ్ళు నిలబడ్డాం. మీరంతా నిలబడిన తరవాత మిగిలిన కోటిడగ్గిరే నేను నిలబడ్డాను. ఇందులో నా తప్పేమీ లేదు. నా అదృష్టం ఇలా వుంది, మీ అదృష్టం అలావుండి. దానికి ఎవరేంచేస్తారు?" అన్నాడు అఖరువాడు.

"అదంతా కుదరదు. మనం ఈ విషయం న్యాయస్థానంలో పరిష్కారం చేసుకోవలిసిందే," అన్నారు అన్నలు.

వారు తండ్రి అఖరుకోరికను తృణీకరించి, ఉజ్జయినికి వెళ్లి తమ తగాదాను రచ్చకెక్కించారు.

న్యాయాధికారి వారు చెప్పినదంతా విని, "మీ తండ్రికి గల ఆస్తి ఏమిటి? వివరంగా చెప్పండి." అని అడిగాడు.

"మా తండ్రిగారికి పొలాలూ, పశువులూ, ధాన్యపు వ్యాపారమూ, వెండిబంగారాలూ ఉన్నాయి," అని రెడ్డి కొడుకులు బదులు చెప్పారు.

"వాటినే మీ తండ్రి మీకు పంచాడు. ధాన్యపువ్యాపారం పెద్దవాడిది. పశుసంపద రెండోవాడివి. పొలాలు మూడోవాడివి. వెండిబంగారాలు నాలుగోవాడివి. వాటిని పంచుకుని సుఖంగా ఉండండి," అని తీర్పుచెప్పాడు న్యాయాధికారి.

ఆ తీర్పు ముగ్గురన్నలకూ ఎంతో ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగించింది. తమ తండ్రి అఖరువాడిమీద ప్రత్యేకంగా చూపిన అభిమానం ఏమీలేదని తెలుసుకుని, నలుగురూ తమ గ్రామానికివెళ్ళి ఐకమత్యంగా జీవించసాగారు.






చాలాకాలం కిందట ఒకానొక దేశంలో ఒక పురోహితు డుండేవాడు. ఆయనకు మాణిక్యం అని ఒక కూతురుండేది. ఆమె చాలా ధైర్యంగలది. ఒకనాడు పురోహితుడూ, అతని భార్యా సంపాదనకోసం వెళ్ళి పొద్దూకినతర్వాతకూడా రాలేదు.

సూర్యాస్తమయం అయిన కొంతసేపటికి మాణిక్యం స్నానంచేద్దామని స్నానాల గది లోకి వెళ్ళి, అక్కడ నీళ్ళకాగువెనక ఎవరో దొంగ వున్నట్టు పసికట్టింది. ఆమె స్నానం మానేసి ఇంట్లోకి వెళ్లి తలుపు వేసుకుంది.

మరి కాస్త చీకటిపడ్డాక దొంగవాడు స్నానాల గదిలోనుంచి వచ్చి ఇంటి వాకిలి తలుపు తట్టి చిన్నగొంతుతో, "అమ్మాయ్?" అని పిలిచాడు. తండ్రి పిలిచాడని మాణిక్యం తలుపు తీస్తుందని వాడి ఉద్దేశం.

తలుపు సందుల్లోనుంచి దొంగను చూసిన మాణిక్యం, "తలుపు గడియ బిగుసుకుంది, నాన్నా! ఆపక్క కిటికీ లోంచి దూరివచ్చి గడియ తియ్యి!" అన్నది. తన యుక్తి పారినందుకు సంతోషించి దొంగవాడు పక్క కిటికీదగ్గిరికి వచ్చే లోపుగా మాణిక్యం కిటికీదగ్గిర గండ్రగొడ్డలితో నిలబడి, వాడు కిటికీలోనుంచి తల దూర్చగానే ఒక్క పెట్టు పెట్టింది.

తరవాత మాణిక్యం దొంగవాడి మొండాన్ని తునకలు తునకలుగా నరికి, తలనూ అవయవాలనూ వేరు వేరు గోతాలలో పెట్టి మూతులు కట్టింది. ఆ తరవాత దీపం ఆర్పేసి కూచుంది.

మరికొంతసేపట్లో దొంగవాడి అనుచరులైన మిగిలిన దొంగలు వచ్చి, తలుపు తట్టారు. మాణిక్యం తలుపువద్దకు వచ్చి రహస్యంగా "ఎవరు?" అని అడిగింది.

"పని ముగిసిందా?" అని వాళ్ళూ రహస్యంగానే అడిగారు.

ఆర్. లలితమ్మ




"పని ముగించాను. పక్క కిటికీదగ్గిరికి వస్తే మూటలు అందిస్తా," అని మాణిక్యం రహస్యంగానే చెప్పింది.

దొంగలు మాణిక్యం గొంతు తెలుసుకో లేకపోయారు. పక్క కిటికీదగ్గిరికి వచ్చారు. మాణిక్యం వారికి మూటలు అందించింది.

"ఇక రా! పోదాం," అన్నారు దొంగలు.

"వంటిల్లుకూడా చూసి నేను మీ వెనకే వస్తా. మీరు ముందు నడుస్తూండండి," అన్నది మాణిక్యం.

"ఆలస్యం చేసేవ్?" అంటూ దొంగలు వెళ్లిపోయారు.

పొద్దుపోయి తల్లిదండ్రులు రాగానే మాణిక్యం వారితో జరిగినదంతా చెప్పింది. వాళ్ళు తమ కూతురి ధైర్యసాహసాలకు సంతోషించారు. కాని మిగిలిన దొంగలు పిల్లమీద పగతీర్చుకుంటారేమోనని మాత్రం వాళ్ళు భయపడ్డారు.

ఈలోపుగా దొంగలు అడివిలో వున్న తమ మేడ చేరుకుని మూటలు విప్పి తమ అనుచరుడికి జరిగిన ఘోరం తెలుసుకున్నారు. "ఇదంతా ఆ పురోహితుడి కూతురి పని! దానిపని పట్టించాలి," అనుకున్నారు. మర్నాడందరూ మంచి మంచి దుస్తులు వేసుకుని, ఫుల్లయ్య అనే వెర్రి వాడికి గొప్పగా అలంకారాలుచేసి అందరూ బయలుదేరి పురోహితుడింటికి వెళ్ళారు.

"ఏమండీ, మీ ఇంట పెళ్ళికావలసిన పిల్ల వుందని చెప్పారు. ఉంటే మావాడికి చేసుకుని తోచినంత నగనట్రు పెడతాం. పెళ్లిఖర్చులుకూడా మేమే పెట్టుకుంటాం!" అన్నారు దొంగలు పురోహితుడితో.

పురోహితుడు సంతోషించాడు. ఖర్చు లేకుండా పిల్ల పెళ్లయిపోతుంది. వియ్యాల వారు ధనికులుగా కనపడ్డారు. దొంగలు పిల్లమీద పగ సాధించేలోపుగా పిల్లని అత్త వారింటికి పంపెయ్యటమూ మంచిదే! ఇవన్నీ ఆలోచించి పురోహితుడు సరేనన్నాడు.

"వీళ్ళ వాలకం చూస్తే వీళ్ళే నిన్న వచ్చిన దొంగలల్లే ఉన్నారు, నాన్నా!" అని మాణిక్యం తండ్రితో అన్నది. కాని మాణిక్యం తల్లిదండ్రులు కోప్పడ్డారు.

"పిచ్చిగా మాట్లాడకు. దొంగ లెక్కడన్నా ఇంత మంచి బట్టలు వేసుకుంటారా? నగలు పెడతారా?" అన్నారు వాళ్ళు.

ఆ పూటే పెళ్ళయింది. సాయంకాలం పెళ్ళివారు పెళ్ళికూతురుతో సహా తరలి వెళ్లారు. చీకటి పడేసరికల్లా వారు అడవిలో తమ మేడ చేరుకున్నారు.

"హంతకిని ఇప్పుడే చంపేద్దాం!" అన్నారు కొందరు దొంగలు.

"నాకు పెళ్లి చేసినట్టేచేసి, నా పెళ్లాంతో ఒక్క మాటైనా మాట్లాడకముందే దాన్ని చంపేస్తారా?" అని ఏడవటం ప్రారంభించాడు పిచ్చి పుల్లయ్య.

"సరే, రేప్పొద్దుటిదాకా అది పారిపోకుండా చూసే భారం నీది! రేప్పొద్దున దాన్ని హతమారుస్తాం," అన్నారు దొంగలు.

దొంగలు కింది అంతస్తులో పడుకున్నారు. మాణిక్యాన్ని పైకి పంపారు. పుల్లయ్య సంతోషపడుతూ పైకి వచ్చాడు. అతడు రాగానే మాణిక్యం, "అబ్బ! ఈ మేడలో ఎంత ఉక్కగా వున్నది! గాలే రావటంలేదు,!" అన్నది.





"అమ్మో! నువు బయటికి పోవటానికి వీల్లేదు. వాళ్లు చంపేస్తారు," అన్నాడు పుల్లయ్య భయపడుతూ.

"నా మొగుడివి కదూ! యెలాగైనా తోటలో ఒక్క పావుగంటసేపు తిరిగిరానీ!" అన్నది మాణిక్యం.

"పారిపోవటానికా? నాకు తెలుసులే!" అన్నాడు పుల్లయ్య.

"నీ కంత అనుమానమైతే నా నడుముకు మోకు కట్టి కిటికీలోనుంచి దించు. కాస్సేపు గాలి మేసి తాడు గుంజుతాను, పైకి లాగెయ్యి!" అన్నది మాణిక్యం.

ఈ ఉపాయం పిచ్చిపుల్లయ్యకు నచ్చింది. వాడు మాణిక్యం నడుముకు తాడు కట్టి కిటికీగుండా కింది తోటలోకి దించాడు. మాణిక్యం కింద దిగుతూనే తాడు ఊడదీసుకుని దాన్ని ఒక మేక నడుముకు కట్టి పారిపోయింది.

మేక గడ్డి మేస్తూ అటూ ఇటూ తిరగటంలో పిచ్చిపుల్లయ్య చేతిలో తాడు బిగుసుకున్నది. వాడు దాన్ని పైకి లాగసాగాడు. మేక "మే, మే" అని అరవసాగింది.

"ఇశ్! ఊరుకో! ఏమిటా మేక అరుపులు? వాళ్ళు వింటే నిన్నూ నన్నూ తంతారు," అన్నాడు పుల్లయ్య. కాని మేక




ఇంకా గట్టిగా అరవసాగింది. ఎట్లాగో పుల్లయ్య మేకను లోపలికి చేర్చి, "అయ్యో, నా పెళ్లాం మేక అయిపోయింది!" అని ఏడవసాగాడు.

మేక అరుపులూ, పిచ్చివాడి ఏడుపూ విని దొంగలు నిద్రలేచి పైకివచ్చి చూశారు. పిచ్చివాణ్ణి మోసంచేసి మాణిక్యం పారిపోయిందని తెలుసుకున్నారు. ఆమెను పట్టుకోవటానికి గుర్రాలమీద అప్పటికప్పుడే బయలుదేరారు.

అడివిలో కొంత దూరం వెళ్లిన మాణిక్యం గుర్రాల చప్పుడు విని, సమీపంలో ఒక చెట్టులో పెద్ద తొర్ర ఉండటం గమ

నించి అందులోకి దిగి దాక్కుంది. మరు క్షణంలోనే దొంగలు వచ్చారు. వారికి ఎక్కడా మాణిక్యం జాడ కనపడలేదు. వారిలో ఒకడు తన కత్తితో చెట్టు తొర్ర లోకి పొడిచిచూశాడు. కత్తి మొన మాణిక్యం భుజంలోకి దిగపడింది. కాని ఆమె కిక్కురుమనలేదు. దొంగ కత్తి బయటికి లాగేటప్పుడు ఆమె తన చీరెతో కత్తిని తుడిచింది. కత్తికి రక్తంమరక లేక పోవటం చూసి దొంగ చెట్టు తొర్రలో ఎవరూ లేరనుకున్నాడు.

దొంగలను చాలా దూరం వెళ్ళనిచ్చి మాణిక్యం చెట్టుతొర్రలోనుంచి దిగి రోడ్డు మీదికి చేరింది. రోడ్డువెంట చాలాసేపు నడిచాక ఆమెకు మళ్ళీ గుర్రాల చప్పుడు వినిపించింది. ఆ సమయానే ఒక గడ్డి బండి అటుగా వచ్చింది.

"చిన్నాన్నా! చిన్నాన్నా! దొంగలు తరుముతున్నారు! నన్ను గడ్డిలో దాచవూ?" అన్నది మాణిక్యం బండీవాడితో.

బండీవాడు మాణిక్యాన్ని బండి వెనక భాగంలో గడ్డిలో దాచి ఏమీ ఎరగనట్టు బండి తోలసాగాడు. ఇంతలో దొంగలు రానేవచ్చారు. బండివాణ్ణి అటకాయించి, "ఇటుగా యెవరైనా పెళ్ళికూతురు వచ్చిందా?" అని అడిగారు.



"నేను చూడలేదే?" అన్నాడు బండీ వాడు అమాయికంగా.

ఒక దొంగ బండిమీది గడ్డిలోకి తన కత్తితో నాలుగైదు చోట్ల పొడిచిచూశాడు. అందులో ఒక పోటు మాణిక్యం కాలిలో తగిలింది. మునపటిలాగే మాణిక్యం కత్తిని చీరెతో తుడిచింది. కత్తిపై రక్తం లేక పోవటంతో వాళ్లు తృప్తిపడి వెళ్లిపోయారు.

ఎలాగైతేనేం మాణిక్యం దొంగల బారి నుండి తప్పించుకుని తూర్పు తెల్లవారేవేళ తండ్రి ఇల్లు చేరుకుంది. కుమార్తెను చూసి తండ్రి నిర్ఘాంతపోయాడు.




"ఏమే, అమ్మాయ్, ఇలా వచ్చావు? నీ భర్త ఏడీ? ఒక్కర్తెవే వచ్చావేం? ఒంటినిండా రక్తంమరకలేమిటి?" అని పురోహితుడు ప్రశ్నల వర్షం కురిపించాడు.

"నేను చెప్పలేదా, నాన్నా? వాళ్ళు దొంగలు. నన్ను చంపటానికి ప్రయత్నించారు. వెంట్రుకవాసిలో చావు తప్పించుకు బయటపడ్డాను," అంటూ మాణిక్యం జరిగినదంతా తండ్రికి చెప్పింది.

పురోహితుడు తన అవివేకానికి యెంతో నొచ్చుకున్నాడు.

"ఇప్పుడైనా మనకు క్షేమం లేదు. నన్ను భద్రంగా దాచు. దొంగలు నాకోసం వస్తారు. వాళ్లు దొంగలని నీకు తెలిసినట్టు కనబడకుండా, ఉపాయంగా వాళ్ళను రాజ భటులకు పట్టివ్వు," అన్నది మాణిక్యం.

పురోహితుడు మాణిక్యాన్ని భోషాణం పెట్టెలో దాచి ఊళ్ళోవున్న సర్దారుదగ్గిరికి పోయి, జరిగినదంతా చెప్పి, "అయ్యా, తమరు మారువేషాలలో ఇరవైమంది భటులను పంపండి. నేను తమకు దొంగలను పట్టిస్తాను," అన్నాడు.

మామూలు దుస్తులతో కొందరు రాజ భటులు పురోహితుడి ఇంటికి వచ్చి, తివాసీలు పరుచుకుని విశ్రాంతిగా కూచుని తమలో తాము కబుర్లు చెప్పుకోసాగారు.



ఇంతలో గొప్ప దుస్తులు వేసుకుని, గుర్రాలమీద దొంగలు దిగారు. వారిని చూడగానే పురోహితుడు సంతోషంతో లేచి వచ్చి, "దయచేయండి, దయచేయండి! వియ్యాలవారు వచ్చారు, కాళ్ళు కడుక్కొనేందుకు నీళ్ళు పట్టుకురావే!" అంటూ మర్యాదలు చేశాడు.

"మేము తొందరపనిమీద వచ్చాము. వ్యవధి లేదు," అన్నారు దొంగలు.

"అమ్మాయి కులాసాగా వుందికద?" అని అడిగాడు పురోహితుడు.

మాణిక్యం, తండ్రి ఇంటికి రాలేదని దొంగలు రూఢి చేసుకుని, "అమ్మాయి కులాసాగానే వుంది. సుఖంగా ఉన్నానని మీతోనూ, మీ భార్యతోనూ చెప్పమంది. అందుకే వచ్చాం. ఇక వెళతాం. మాకు ఊళ్ళో అవసరమైన పని ఉంది," అన్నారు.

"ఇంటిదాకా వచ్చి భోంచెయ్యకుండా పోతే ఊరుకునేదిలేదు. ఒక ఘడియలో పంక్తికూడా అయిపోతుంది. లోపలికి దయచెయ్యాలి," అని పురోహితుడు నిర్బంధించాడు. గత్యంతరంలేక దొంగలు ఇంట్లోకి అడుగుపెట్టారు.

అక్కడ తివాసీలమీద కూచునివున్న జనం దొంగలకు కనిపించారు.

"వీరంతా ఎవరు?" అని దొంగలు పురోహితుణ్ణి అనుమానంగా అడిగారు.

"అమ్మాయి పెళ్లి సంగతి తెలిసి చూడ వచ్చిన మా బంధుజనంలెండి" అంటూ పురోహితుడు దొంగలను వారికి చూపి, "వీరే మా వియ్యాలవారు," అన్నాడు.

మరుక్షణంలో రాజభటులు దొంగలను చుట్టుముట్టి, ఒక్కణ్ణికూడా పోనివ్వకుండా పట్టి బంధించి తీసుకుపోయారు.

తరవాత మాణిక్యం సర్దారుకు అడవిలో దొంగల ఇల్లు చూపించింది. అక్కడ వాళ్లు దాచిన ధనం దొరికింది. అందులో కొంత మాణిక్యానికి సర్దారు బహుమతి చేశాడు.





# సర్దారు తమ్ముడు

ఒకానొక దేశంలో ఒక రైతుకు ఒక కొడుకుండేవాడు. తరవాత చాలాకాలంవరకు సంతానం లేకుండా ఉండి, ఆ రైతు ముసలితనంలో మరొక కుమారుణ్ణి కన్నాడు. రెండవవాడు పసివాడుగా ఉండగానే రైతు పెద్దకొడుకు రాజధానికి వెళ్ళి, రాజభటుడుగా కొలువులో ప్రవేశించి కొంతకాలానికి సర్దారు పదవి సంపాదించాడు.

ఈలోపుగా చిన్నవాడు పెరిగి పెద్దవాడై అన్నలాగే రాజధానికి వచ్చి రాజభటుడి నౌకరి సంపాదించాడు. ఒకరోజున వాడు, గుర్రంమీద యెక్కివచ్చే తన అన్నను గుర్తించి, "అన్నా, నేను నీ తమ్ముణ్ణి. రాజభటుడుగా చేరాను," అని చెప్పుకొన్నాడు. కాని సర్దారు తన తమ్ముణ్ణి గుర్తించక, "ఎవడురా నువు? నా దారికి అడ్డులే!" అని కాలితో ఒక తోపు తోసి, గుర్రాన్ని అదిలించి ముందుకు సాగిపోయాడు.

ఇది చూస్తున్న సాటి రాజభటులు నవ్వాపుకోలేక పక్కున నవ్వేశారు.

అన్న ప్రవర్తన చూసి తమ్ముడికి చాలా విచారమూ, అవమానమూ అయింది. రాజభటుడుగా పనిచేసినంత కాలమూ తాను అప్పుడప్పుడూ అన్నను చూడవలిసివస్తూనే ఉంటుంది. అన్నను చూసినప్పుడల్లా తనకు బాధ కలగక తప్పదు. అందుచేత తమ్ముడు ఒక రాత్రి ఎవరూ చూడకుండా పని మానేసి పరారీ అయిపోయి, కొంత దూరాన ఉన్న కారడవిలో చేరి, అక్కడ కందమూలాలు తింటూ బ్రతకసాగాడు.

తరువాత కొద్దికాలానికే రాజుగారు తన సిబ్బందితోసహా అడవికి వేటాడ వచ్చాడు. ఆ అడవిలో ఒక మదించిన జింక రాజు కంటపడి, మరుక్షణమే మెరుపులాగా పారిపోయింది. రాజు తన గుర్రంమీద దాని వెంటపడ్డాడు జింక కొంత దూరం పరి

కె. రుక్మిణీదేవి



గత్తి ఒక జలప్రవాహానికి అడ్డంపడి ఈది అవతల ఒడ్డున వున్న కీకారణ్యంలో మాయమైపోయింది. రాజుకూడా దాన్ని ఎలాఅయినా పట్టాలన్న పట్టుదలతో ప్రవాహాన్ని దాటి అరణ్యం ప్రవేశించాడు.

ఎక్కడా జింక జాడ లేదు. చుట్టూ అంధకారంలాగా ఉంది. ఎంత దూరం పోయినా కాలిబాటకూడా తగలలేదు. రాజుకు తూర్పు పడమరలుకూడా తెలియకుండాపోయాయి. ఈ కీకారణ్యంనుంచి ఎలా బయటపడటమా అని రాజు డిగులు పడుతున్న సమయంలో తలవని తలంపుగా సర్దారు తమ్ముడు తటస్థపడ్డాడు.

"ఎవరు, నాయనా, నువు? యిక్కడికెలా వచ్చావు?" అని సర్దారు తమ్ముడు రాజు నడిగాడు.

"నేను రాజుగారి కొలువులో ఉండేవాణ్ణి. వేటకు వచ్చి దారి తప్పాను. నన్నెలాగైనా ఈ అరణ్యంలోనుంచి బయటపడెయ్యి, తమ్ముడూ!" అన్నాడు రాజు.

"పొద్దూకిపోయింది. ఈ రాత్రి యెలాగైనా గడిపెయ్యి. తెల్లారగానే నీకు దారి చూపుతాను," అంటూ సర్దారు తమ్ముడు దారితీశాడు.

వారు చాలాదూరం నడిచి ఒక గుడిసె వద్దకు వచ్చారు.

"బతికాం! ఈ రాత్రికి ఇక్కడ తల దాచుకోవచ్చు," అన్నాడు సర్దారుతమ్ముడు.

ఆ గుడిసెలో ఒక ముసలమ్మ ఉంది.

"అవ్వా, మాకు వెంటనే భోజనం పెట్టు. ఆకలి దహించుకు పోతోంది!" అన్నాడు సర్దారు తమ్ముడు.

"నాకే లేదు, మీకేం భోజనం పెట్టేది, నాయనా?" అన్నది ముసలిది.

సర్దారు తమ్ముడు కత్తిదూసి, "ముసలి ముండా, మాతో అబద్ధాలాడతావుగా. ఒక్క వేటుతో నీ తల ఎగరెయ్యగలను. ఏమనుకున్నావో!" అన్నాడు.

ముసలిది హడిలిపోయి లోపలినుంచి భోజన పదార్థాలు తెచ్చి ఇద్దరికీ వెంటనే వడ్డించింది. ఇద్దరూ భోజనం చేశారు.

"అవ్వా, నిదరొస్తోంది. మాకు పడుకునే టందుకు చోటు చూపించు," అన్నాడు సర్దారు తమ్ముడు.

"మీ రీ గుడిసెలో నేలమీద పడుకో లేరు, బాబూ. ఇంటి వెనక ఎత్తుగా మంచె ఉంది. అక్కడ మంచి గాలికొడుతుంది. హాయిగా దానిమీద పడుకొని నిద్రపొండి," అన్నది ముసలిది.

ఇంటి వెనక ముసలిది చెప్పినట్టే ఒక మంచే, అది ఎక్కటానికి నిచ్చెనా ఉన్నాయి. సర్దారు తమ్ముడూ, రాజూ దాని మీదికెక్కారు.

"ఇద్దరమూ నిద్రపోవటం క్షేమంకాదు. నేను ముందు నిద్రపోతాను. నువు మేలుకుని ఉండి, ఏమైనా జరిగితే నన్ను నిద్ర లేపు. ఒక నిద్ర అయినాక నేను కాపలా కాస్తాను, నువు నిద్రపోదువుగాని," అన్నాడు సర్దారు తమ్ముడు.

తప్పేదిలేక రాజు సరేనన్నాడు. సర్దారు తమ్ముడు కళ్ళు మూసుకు పడుకున్నాడే గాని నిద్రపోలేదు. కొంచెంసేపటికి వాడు కళ్ళు తెరిచి చూసేసరికి రాజు కూచునే జోగుతున్నాడు. సర్దారు తమ్ముడు లేచి





రాజును వీపుమీద బలంగా కొట్టి, "ఇదేనా నీ కాపలా? రాజభటుడుగాకూడా పనికి రాని నీకు కొలువెట్లా ఇచ్చారు?" అని గట్టిగా కోప్పడ్డాడు.

రాజు పశ్చాత్తాపం నటిస్తూ, "లేదు, లేదు! మేలుకునే ఉంటాను!" అన్నాడు. కాని వేటచేత బాగా అలిసి ఉండటంచేత రాజుకు కళ్ళు మూతలు పడిపోతున్నాయి. అయన నిద్రమత్తుతో పక్కకు పడిపోయి నిద్రపోసాగాడు.

బాగా అర్ధరాత్రివేళ కొందరు దొంగలు గుడిసెదగ్గిరికి వచ్చారు. అది ప్రతిరాత్రి వారు కలుసుకునే కూడలి.

"అవ్వా, భోజనం పెట్టు," అన్నారు వాళ్ళు, దొంగిలించిన సొమ్ము ఒక మూల పోగుపెడుతూ.

"ఏం పెట్టేది, నాయనా? మీకోసం చేసిన వంటయావత్తూ ఇద్దరు దుర్మార్గులు తినేశారు. పెట్టనంటే కత్తిదూసి చంపుతామని బెదిరించారు," అన్నది ముసలిది.

"ఆఁ, ఎవరు వాళ్ళు?" అని అడిగారు దొంగలు కోపంగా.

"ఎవరో! మంచెమీద నిద్రపోతున్నారు," అన్నది ముసలిది.

"నేను వెళ్ళి వాళ్ళసంగతి తేల్చుకొస్తాను," అంటూ ఒక దొంగ బయలుదేరాడు. వాడు నిచ్చెన ఎక్కుతుండగానే సర్దారు తమ్ముడు మంచె ఆడటం గమనించి కత్తిదూసి సిద్ధంగా ఉన్నాడు.

దొంగ గబగబా నిచ్చెన ఎక్కాడు. వాడి తల పైకి రాగానే తమ్ముడు ఒక్క వేటున వాడి కంఠం నరికేసి శవాన్ని పైకి ఈడ్చేశాడు.

పోయిన దొంగ ఎంతకీ తిరిగి రాకపోవటం చూసి మరొక దొంగ వచ్చాడు. వాణ్ణికూడా సర్దారు తమ్ముడు చంపేశాడు.

ఈ విధంగా ఒక్కొక్కరే దొంగలందరూ వాడి కత్తికి బలి అయిపోయారు.



తెల్లారు జామున రాజు లేచాడు. దొంగల శవాలన్నీ చూసి కంగారు పడ్డాడు. సర్దారు తమ్ముడు రాజుతో జరిగినదంతా చెప్పాడు. ఇద్దరూ మంచె దిగి వచ్చారు.

"ముసిలిముండా! నువు చేసేది ఈ పనా? నీసంగతి తేలుస్తానుండు. దొంగలు తెచ్చే సొమ్మంతా ముందు బయట పెట్టు," అన్నాడు సర్దారు తమ్ముడు.

ముసలిది భోషాణంలోనుంచి బోలెడంత బంగారం పైకి తీసింది. సర్దారు తమ్ముడు తన పైబట్టలో కొంత మూటకట్టుకొని, మరి కొంత జేబులలో కుక్కుకుని రాజును కూడా తీసుకోమన్నాడు.

"రాజుగారి దివాణంలో డబ్బుకేమీ లోటులేదు, నాకు వద్దులే" అన్నాడు రాజు.

తరవాత సర్దారు తమ్ముడు రాజును అడివి దాటించి ఒక మార్గం చూపి:

"ఇది నేరుగా నగరానికి పోతుంది, హాయిగా వెళ్ళు." అన్నాడు.

రాజు అతనికి ధన్యవాదాలు చెప్పి, "ఎప్పుడైనా మా యింటికి రారాదా? నీకు లాభించే ఉపాయంచేస్తాను," అన్నాడు.

"నీదగ్గిర దాపరికం దేనికి? నేను నగరంలో అడుగు పెట్టానంటే నన్ను పట్టుకొని ఖైదుచేస్తారు. నేను రాజభటుడుగా కొలువుంటూ పారిపోయి వచ్చేశాను," అని



సర్దారు తమ్ముడు, తన అన్ననుగురించీ, ఆయన తనను గుర్తించక అవమానించటం గురించీ రాజుతో చెప్పేశాడు.

"రాజుగారు నా మాట తీసెయ్యరు. ఆయనతో నీ ధైర్యసాహసాల మాట చెప్పావంటే నిన్ను క్షమించటమే గాక మంచి బహుమతి కూడా ఇస్తారు. ఈ ఉంగరం చూపించావంటే దర్బారులోకి రానిస్తారు," అని రాజు వెళ్ళిపోయాడు.

కొద్దిరోజులు ఆలోచించినమీదట సర్దారు తమ్ముడు దివాణానికి పోవటానికి నిశ్చయించుకుని బయలుదేరాడు. అతను రాచనగరు చేరిన మరుక్షణంనుంచీ కనిపించిన ప్రతిరాజభటుడూ అతనికి సలాం కొట్టి దర్బారుకు దారి చూపసాగాడు. సర్దారు తమ్ముడు తన జేబుల్లో ఉన్న బంగారం రాజభటులకు ఇవ్వసాగాడు.

దర్బారు దగ్గిరపడుతున్నకొద్దీ సలాములు కొట్టే గులాముల సంఖ్య హెచ్చసాగింది. "చూశావా, ఆ మనిషి యెంత తెలివితక్కువ వాడో! నాకు దొంగల బంగారం దొరికిందని దివాణంలో అందరికీ చెప్పేశాడు. అందుకే వాళ్ళు నన్ను సర్దారును చూసినట్టు చూస్తున్నారు," అనుకున్నాడు సర్దారు తమ్ముడు.

కాని దర్బారులో అడుగుపెట్టి సింహాసనం మీద రాజును చూడగానే సర్దారు తమ్ముడు నిర్ఘాంతపోయాడు. అతని కంతా అర్థమయింది. "అమ్మయ్యో, సరిగా కాపలా కాయలేదని నేను కొట్టింది రాజుగారినే?" అనుకున్నాడతను.

అయితే రాజుగారు మాత్రం సర్దారు తమ్ముడికి మంచి స్వాగతం ఇచ్చి, అతని ధైర్యసాహసాలను సభికులకు వర్ణించి చెప్పి, అతనికి పెద్ద సర్దారు పదవి ఇచ్చాడు. సర్దారు పదవిలో ఉండిన అన్నను ఆ పదవిలోనుంచి తీసివేసి, మామూలు భటుడుగా, తమ్ముడికింద నౌకరుగా వేశారు.






# నిజమైన మాట

అక్బరు చక్రవర్తి ఆస్థానంలో వీరబల్ విదూషకుడుగానూ, అంతరంగికుడుగానూ, ఉండేవాడు. తాన్సేను సంగీతవిద్వాంసుడు. తాన్సేన్‌పాట వినడానికి దేశదేశాలనుండి ప్రముఖులు వచ్చేవారు.

ఈ ప్రజ్ఞకు తాన్సేను అతిశయపడలేదు. కాని, తక్కిన ముసల్మానులకు, తాన్సేనుకు సమానుడు లేడని గర్వం పట్టుకున్నది. అంతేకాదు. చక్రవర్తికి అభిమానుడైన వీరబల్‌ను తప్పించి, ఆ స్థానంలో తాన్సేన్‌ను నియమించడం తగునని సూచనలు చేస్తూవచ్చారు. ఈ మాటలను గ్రహించిన చక్రవర్తి ఈ ప్రస్తావన సహించలేక "మీరేమైనా చెప్పండి, వీరబలుడంతటి వాడు జన్మజన్మేపి మరొకడు కానేరడు," అని జవాబు చెప్పాడు.

అప్పటికేమీ అనలేక ముసల్మానులు, కొన్నాళ్ళ తరవాత ఒకనాడు సభ ఏర్పాటు చేశారు. చక్రవర్తినికూడా ఆహ్వానించారు. ఆనాడు చాలా వేడిగా, ఉక్కగా ఉన్నది. ప్రమిదలలో చమురు, వత్తి వేసి ఊరకున్నారుగాని, చీకటిపడినా ముసల్మానులు వెలిగించలేదు. తాన్సేను దీపకరాగం పాడేసరికి, దీపాలన్నీ వాటంతటవే వెలిగినై. మేఘమల్లార్‌రాగం పాడాడు. వెంటనే ఉక్కపోయి, వర్షం కురిసింది.

ఇందుకు చక్రవర్తి వింతపడడం చూచి, ఒక ముసల్మాను వృద్ధుడు 'ప్రభూ!— ఇప్పుడు బోధపడిందా? వీరబలుడికి ఇటువంటి ప్రజ్ఞ లెక్కడివి? అందుకనే మంత్రి పదవికి తాన్సేను తగినవాడని లోకం ఘోషిస్తున్నది' అని చాకచక్యంతో మనవి చేశాడు.

అందుకు అక్బరు 'తాన్సేన్ గొప్ప విద్వాంసుడే కావచ్చు. కాని, వీరబలుని పోలడు. కావాలంటే ప్రత్యక్షంగా రుజువు చేస్తాను,' అని కచ్చితంగా చెప్పాడు.

పి. నాగేశ్వరరావు



మరి కొద్దిరోజుల్లోనే అక్బరు చక్రవర్తి ఆవాదేశపు రాజుకు జాబొకటి వ్రాశాడు. ఆ ఉత్తరానికి ముద్రలువేసి, వీరబలుణ్ణీ తాన్సేన్‌ని పిలిచి, 'మీరీ లేఖపట్టుకొని ఆవా రాజువద్దకు పోవాలి. చాలా అవసరమైన పని. ఈ పని మీరిద్దరుతప్ప మరెవ్వరూ నిర్వహించలేరు' అని చెప్పి, జాబిచ్చాడు.

వారు బయల్దేరారు. తాన్సేను మనసులో 'ఇదేదో ముఖ్యమైన కార్యమై వుంటుంది. ఆరాజుకు నా సంగీతం వినిపించి బహుమతి పొందుతాను' అనుకొని సంతోషించాడు.

కాని, వీరబల్ మట్టుకు 'ఇందులో ఏదో రహస్యం ఉండకపోదు' అని వెయ్యివిధాల ఆలోచింపసాగాడు. చివర కెలాఐతేనేం, మహారణ్యాలు దాటుకుపోయి కొన్నాళ్ళకు వారు బర్మా చేరుకొని, ఆవారాజు దర్శనం చేసుకొన్నారు.

జాబు చదువుకొన్నాడు రాజు. అందులో ఇలావుంది :—'నా సేవకులిద్దరు మీ దర్శనానికి ఈ లేఖపట్టుకువస్తారు. ఒక రహస్యాపరాధం చేయడంచేత వీరిని దండింపవలసి వచ్చింది. గోప్యంగా జరపవలసిన కార్యం కనుక ఇక్కడ ఆ పనిచేయ వీల్లేక, మీ వద్దకు పంపినాను. మీరు మరణదండన విధించవలసింది.'

రాజు జాబుచదువుకుని మంత్రికిచ్చాడు. అతడు ఇందులో ఏదో రహస్యముందని గ్రహించి, 'రాజా–వీరిని ఒక వారంరోజులు చెరలో పెట్టి, తరువాత యుక్తమైన దండన విధించుదాము' అని సలహా చెప్పాడు. ఆ ప్రకారం వారి చేతులకు బేడీలు తగిలించి కారాగృహానికి తీసుకుపోయారు.

తాన్సేనుకు మతిపోయినట్టయింది. వీరబలుడికేసి దీనంగా, ఏమిటి ఉపాయం? అన్నట్టుగా చూచాడు. అప్పుడు వీరబలుడు అతని చెవిలో ఏదో వూదాడు. లోన కుమిలిపోతున్నా, తాన్సేన్ పైకి ధైర్యంగానే కనబడజొచ్చాడు.



గడువు వారంరోజులూ ముగిసింది. తలారులు వచ్చి వీరిని వధ్యస్థానానికి తీసుకుపోయారు. అక్కడ వీరబలూ, తాన్సేనూ 'నన్ను ముందు చంపు' అంటే 'నన్ను ముందు చంపు' అని పోరాడసాగారు. తలారులు రాజువద్దకు పోయి, 'వీళ్లిద్దరూ పిచ్చి వాళ్ళు ప్రభూ!' అని మనవిచేశారు.

అప్పుడు రాజు వారిని పిలిపించి, 'ఎందుకిలా వాదులాడుతున్నారు?' అని అడిగాడు.

'రాజా!—చెబితే మాకు చాలా నష్టం కలుగుతుంది. అందుచేత చెప్పదలచలేదు' అన్నాడు వీరబల్.

'నిజం చెప్పకుంటే యావజ్జీవ ఖైదు వేయిస్తా,' అన్నాడు రాజు.

ఇక తప్పదన్నట్టుగా, వీరబల్ ఇలా ప్రారంభించాడు :—'రాజా!-చాలా కాలం నుంచి ఆవారాజ్యం కలుపుకోవాలని మా రాజు వుద్దేశం. కాని, తమరు బలశాలులని బెదిరిపోతున్నాడు. ఒకనాడు ఒక జ్యోతిశ్శాస్త్రవేత్త వచ్చి 'రాజా! ఎందుకు విచారిస్తావు? నీ రాజ్యంలో ఇద్దరిని ఆవారాజు వద్దకు ఏదో మిషపైన పంపించు. వారిని రాజుకనుక చంపెనా, మొదట చచ్చినవాడా దేశానికి రాజవుతాడు, తర్వాత మరణించిన వాడు మంత్రి అవుతాడు. అప్పుడు వారు



నీకు సామంతులుగా ఉంటారు. ఈవిధంగా నీ కారాజ్యం దక్కాలిగాని, యుద్ధంచేసి గెలవడం నీతరంకాదు' అని చెప్పాడు. ఈ కారణంచేత మమ్మల్నిద్దరినీ పంపించాడు. ఈ సంగతి వెల్లడించినందుకు మా రాజు మమ్మల్ని చంపేతీసుతాడు. కనుక, అక్కడికి పోకుండా మమ్మల్ని తమరే చంపించి పుణ్యం కట్టుకోండి ప్రభూ!'

అప్పుడు రాజు మంత్రికేసి చూచాడు. మంత్రి రహస్యంగా ఇలా చెప్పాడు :—'రాజా!—వీరి పరస్పర కలహంవల్ల మనకు అసలు రహస్యమంతా తెలిసిపోయింది. వీరిని చంపితిమా మన రాజ్యం మనకు

దక్కదు. కనుక, వచ్చినదారినే వీరిని పంపి వేయడం మంచిది.'

మంత్రిమాటలను నమ్మిన రాజు వీరబలుడితో 'అబ్బాయీ!—మిమ్మల్ని చంపమని మీ రాజు జాబువ్రాసి పంపాడు. అజ్ఞ నెరవేర్చడానికి మేమేం వారి సేవకులం కాము. 'నిర్దోషులను చంపిన పాపం మాకు వద్దు. వీరిని మీరే చంపుకోండి,' అని మేము చెప్పినట్టు మీ రాజుతో చెప్పండి. పొండి!' అన్నాడు.

ఇందుకు వీరబల్ 'మహారాజా!—ఇది తమకు న్యాయం కాదు. నేను మొదటే చెప్పానుగా, మా రహస్యం వెల్లడిస్తే మాకు హాని వస్తుందని? అనుకొన్నట్లే అయింది.' అన్నాడు దీనంగా.

'అదంతా మాకు తెలియదు. తెలిసి విష మెవరు తింటారు? పొండి, పొండి. లేకుంటే బైటికి తరిమించివేస్తా' అని బెదిరించాడు రాజు.

భయం నటిస్తూ, వీరబల్ 'సెలవు! సెలవు!!' అని, తాన్సేన్‌ను వెంటబెట్టుకుని బయటపడి మళ్ళీ ఢిల్లీనగరం చేరుకొన్నాడు.

తాన్సేను అక్బరుని చూచి 'ప్రభూ!—వీరబలుడే లేకుంటే నేను తమ దర్శనం చేసుకోగలిగేవాణ్ణే కాదు. అతని బుద్ధికుశలతే మా ఇద్దర్నీ రక్షించింది..." అంటూ, జరిగిన వృత్తాంతమంతా విన్నవించాడు.

అప్పుడు చక్రవర్తి, ఇదివరకు ఎదురు తిరిగిన ముసల్మానులందర్నీ పిలిపించి, వీరబలుని బుద్ధివిశేషం పరీక్షించడానికి తను పన్నిన పన్నుగడ, వీరబల్ బుద్ధి చాతుర్యం వారికి వివరించి చెప్పాడు.

అప్పుడు ముసల్మానులందరికీ అక్బరు చక్రవర్తి చెప్పినది నిజమైన మాట అని నమ్మకం కలిగింది.

ఆవిధంగా ముసల్మానులందరికీ వీరబల్ పైన గల అసూయ పోయి, ఎంతో గౌరవ భావం ఏర్పడింది.



# సూర్యుడు

ఆకాశంలో ఉన్న అన్ని నక్షత్రాలకన్నా సూర్యుడు మనకు దగ్గిరిగా ఉన్న నక్షత్రం. సూర్యుడి తరవాత మనకు దగ్గిరిగావున్న నక్షత్రాన్ని "ఆల్ఫా సెంటారి" అంటారు. సెకండుకు 1,86,000 మైళ్ళు ప్రయాణించేసే కాంతి సూర్యుడినుంచి మనకు చేరటానికి 8 నిమిషాలు పడుతుంది; "ఆల్ఫా సెంటారి"నుంచి కాంతి మనవద్దకు చేరటానికి దాదాపు నాలుగున్నర సంవత్సరాలు పడుతుంది. దీనినిబట్టి ఇతర నక్షత్రాలకన్న సూర్యుడు మనకెంత దగ్గిరగా ఉన్నదీ మనం తెలుసుకోవచ్చు.

* ఆకాశాన సూర్యుడికంటె ఎన్నో రెట్లు పెద్దవైన నక్షత్రాలుకూడా ఉన్నాయి. "ఎప్సిలాన్ ఆరిగే" అనేది రెండు నక్షత్రాల జంట; అందులో ఒకటి సూర్యుడికి 250 రెట్లు, రెండవదాని అడ్డుకొలత సూర్యుడి అడ్డుకొలతకు 3,000 రెట్లు!
* సూర్యబింబం కంటితో చూడలేనంత కాంతివంతమైన బింబం. అయితే ఆ బింబంలో నల్లని మచ్చలు కనిపిస్తాయి. అద్దానికి మసి పట్టించి దానిగుండా సూర్యుడికేసి చూస్తే పెద్ద పెద్ద మచ్చలు కంటికే కనిపిస్తాయి. వాటికేసి రోజూ చూసినట్టయితే అవి ఎడమవైపు నుంచి కుడివైపుకు జరగటం కనిపిస్తుంది. సూర్యబింబం తనచుట్టూ తాను తిరగటంచేత ఈ మచ్చలు ఈవిధంగా కనిపిస్తాయి. కుడిపక్క అదృశ్యమైన మచ్చ 12 లేక 13 రోజుల అనంతరం మళ్ళీ ఎడమవైపున కనిపిస్తుంది.
* సూర్యుడి మధ్యరేఖకు సమీపంలో ఉండే మచ్చ, సూర్యుడి ధృవాలకు దగ్గిరిగా ఉండే మచ్చకన్న శీఘ్రంగా చుట్టు తిరిగివస్తుంది. దీనినిబట్టి సూర్యుడు భూమిలాగా ఘనగోళం కాదని,సూర్యగోళంలోని వివిధప్రాంతాలు వేరువేరు వేగాలతో తిరుగుతున్నాయనీ తెలుస్తుంది.
* సూర్యగోళంమీద ఉండి మండే వాయువులలో గుండాలేర్పడినప్పుడు అవి నల్లని మచ్చలలాగా మనకు కనిపిస్తాయని చెబుతారు. సూర్యుడి ఇతర భాగాలకంటె ఇవి నల్లగా ఉంటాయేగాని, వీటికికూడా అంతులేని కాంతి ఉంటుంది. ఒక్కొక్కప్పు డీ మచ్చలు భూమిని అమాంతం మింగెయ్యగలిగినంత పెద్దవిగా ఉంటాయి.
* సూర్యుడి మచ్చల ప్రభావం భూమిమీద ఉండటం చిత్రమైన విషయం. భూమిని ఎల్లప్పుడూ విద్యుత్తరంగాలూ, అయస్కాంత తరంగాలూ ఆవరించి ఉంటాయి. అనేకమైన సూర్యుడి మచ్చలు భూమికెదురుగా వచ్చినప్పుడు భూమిపైగల అయస్కాంత తరంగాలలో సంచలనం కలుగుతుంది.
* సూర్యుడిలో ఈ మచ్చల సంఖ్య హెచ్చుతూ, తగ్గుతూ ఉంటుంది. ఈ మార్పు ఒక క్రమాన్నిబట్టి జరుగుతుంది. పదకొండు సంవత్సరాల కొకసారి మచ్చల సంఖ్య యథాస్థితికి వస్తూవుంటుంది. ఈ "11 ఏళ్ల రుతువు"కు కారణం ఎవరూ కనిపెట్టలేదు.

## మాయాచక్రం (అట్టచివరి బొమ్మ) - 6

రావలసిన చోటికి వచ్చేశామని గుర్రం చెప్పగానే రాణి అంతులేని సంతోషాన్ని పొందింది. 'అశ్వరాజమా!—నీ పని ఇంతటితో తీరిపోలేదు. నేను మళ్ళీ వచ్చేవరకూ నీవు ఇక్కడనే ఉండాలి. ఈ ఉపకారం చేయకతప్పదు' అన్నది.

అందుకు రెక్కల గుర్రం 'రాణీ!— ఈ ఎర్రకోట దేవలోకానికికూడా కనిపిస్తూవుంటుంది. ఇక్కడ వుండే రత్నాలూ మొహిరీలు దేవతలకు ఎంతో ఇష్టం. అందుచేత వారి ప్రభావంవల్ల నే నీ లోకానికి వచ్చి, రాక్షసికి తెలియకుండా కానుకలు పట్టుకుపోతూ వుంటాను' అని చెప్పింది.

ఈ మాటకు రాణి 'నాకోసమని నీవు రేపటివరకూ వుండు. ఆవిధంగా యిద్దరమూ వచ్చినపని ముగించుకుని వెళ్ళిపోవచ్చు' అన్నది.

రాణి ఇలా అంటూవుండగానే కోటలోపలినుంచి రాక్షసి వచ్చి, వింత గుర్రాన్ని చూసి ఆశ్చర్యపడింది. 'అమ్మాయీ!—ఎవరు నీవు? ఇక్కడి కెలా వచ్చావు? ఎందు కొచ్చావు? ఈ గుర్రం ఎవరిది?....' అంటూ ఆత్రంతో ప్రశ్నలవర్షం కురిపించింది.

అప్పుడు రాణి ధైర్యం వహించి, 'నేను మంత్రమహిమలు తెలిసిన ఒక స్త్రీని. ఇది దేవతా అశ్వం. నే నీ గుర్రంమీద ఎక్కి లోకాలు చూచుకొంటూ వస్తున్నా. దారిలో ఈ ఎర్రకోట ముచ్చటగా కనిపిస్తే, ఏమిటో చూదామని ఇక్కడ దిగాను' అని బదులు చెప్పింది.

రాక్షసి ఆమెను ఆదరించి లోపలికి తీసుకుపోయింది. సమస్త మర్యాదలూ చేసింది. చివరకు, తన అంతఃపురంలోకి తీసుకువెళ్ళి, కురూపి ఐన తన కూతురిని చూపించి, 'అమ్మా!—ఇది నా బిడ్డ. దీనికి పెళ్ళిచేదామని ఒక చక్కటి రాజకుమారుణ్ణి పట్టుకవచ్చాను. ఇతర స్త్రీలను వరించకుండా అతని తలను గాడిద తలగా మార్చివేశాను. ఐతే, నాకు శత్రువైన ఒక దేవత— అనురాగవతి ఐన భార్య దొరికితే రాజుకు మామూలు స్వరూపం వచ్చేటట్టు విమోచనమార్గం చెప్పింది. నా కూతురుకు అతనిపైన అనురాగమున్నదిగాని, అతనికి యెంతమాత్రం ఇష్టంలేదు. నీ మహిమచేత ఈ పని అనుకూలం చేసి పెట్టగలవా?' అని అడిగింది.

'ఓ. ఇదెంత పని? ఇదుగో చూడు' అన్నది రాణి. ఇలా అంటూ—

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1955 జూన్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు




* పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.
* ఏప్రిల్ 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.
* మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి రు. 10/-లు బహుమానం.
* వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి. ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అభ్యాసం | రెండవ ఫోటో : కూసువిద్య

పంపినవారు : చెయ్యేటి సూర్యారావు,

మార్కండేయపురం, గొల్లప్రోలు పోస్టు - (తూ. గోదావరి జిల్లా)

బహుమతిమొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది



# వార్తలు-విశేషాలు

ఈనాడు సంచార తపాలాఫీసులు 'మొబైల్ పోస్టాఫీసు'లనే పేరుతో ముఖ్యనగరాలలో పనిచేస్తున్నవి. ఇదే పద్ధతిపైన 'సంచార రిజిస్ట్రేషన్' ఆఫీసులుకూడ ఏర్పాటుచేయటానికి ఆంధ్రప్రభుత్వం తీవ్రకృషి చేస్తున్నది.

*　　　*　　　*　　　*

ద్వితీయ పంచవర్షప్రణాళికలో ప్లానింగ్‌కమిషన్‌వారు కుటీరపరిశ్రమల నిమిత్తం 100 కోట్ల రూపాయలు కేటాయించదలిచారని హైద్రాబాదు హెూంశాఖామంత్రి శ్రీ దిగంబర్‌రావు బిందూ చెప్పారు.

*　　　*　　　*　　　*

**1951** సంవత్సరపు జనభాలెక్కలప్రకారం, ఇండియాలోని 36 కోట్లమంది ప్రజలలోనూ 6 కోట్లమంది—అనగా నూటికి · 16.6 మంది—మాత్రమే చదువుకొన్నవారనీ, తక్కిన 30 కోట్లమందికీ చదువే రాదనీ తేలింది. చదువుకున్న ఈ 6 కోట్లమందీ ఏదో ఒక భాషలో మామూలు ఉత్తరాలు చదవగలిగి వ్రాయగలిగి ఉన్నారు.

*　　　*　　　*　　　*

నయంకావని భావించబడే కొన్ని వ్యాధులకు అణుశక్తిగల మందులను ఉపయోగించే విషయమై పరిశోధనలు ప్రారంభించనున్నారు. ఇందుకుగాను కలకత్తానగరంలో వైద్య భౌతిక శాస్త్ర సంస్థను నెలకొల్పుతారు. ఈ సంస్థకు అవసరమైన భవనాల నిర్మాణానికి స్థలం ఇవ్వడానికి కలకత్తా కార్పొరేషన్ అంగీకరించింది. ఈ శాస్త్రసంస్థకు కేంద్రప్రభుత్వం ధన సహాయం చేస్తుంది.



మన దేశపు ఈశాన్య సరిహద్దుప్రాంతానికి అస్సాంరాష్ట్రానికి మధ్యగల కీకారణ్యంలో 16-వ శతాబ్దంనాటి కాళికాలయం కనుక్కోబడింది. దీన్ని కనుక్కున్నవారు సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులైన శ్రీ శరవానంద రాజకుమార్.

*   *   *   *

మన దేశంలో 1951 లో స్థాపించిన చిత్తరంజన్ లోకోమోటివ్ వర్క్‌షాపులో తయారైన రైలింజన్ల సంఖ్య 200 కు మించింది. ఇప్పుడీ వర్క్‌షాపులో ఏటా 120 ఇంజన్లు, 50 స్పేర్ బోయిలర్లు ఉత్పత్తి అవుతున్నవి. ఇక రెండు సంవత్సరాలతరువాత మనం రైలింజన్లను విదేశాలనుంచి తెప్పించుకోవాల్సిన అగత్యం ఉండదు.

*   *   *   *

అణుశక్తియొక్క శాంతియుత ఉపయోగాలనుగురించి ప్రజలకు వివరించేందుకు ఢిల్లీలో ఒక ప్రదర్శన ఏర్పాటుచేయబడింది. ఢిల్లీలో ఇది 26 రోజులు ప్రదర్శింపబడిన తర్వాత దేశంలోని 50 ముఖ్య పట్టణాలలోకూడా ప్రదర్శింపబడగలదు.

*   *   *   *

మార్చి 7 నుండి 12 వరకు మద్రాసులో బాలచిత్రోత్సవం నడిచింది. ఫిలింఫాన్స్ అసోసియేషన్ యాజమన్యాన ఏర్పడిన ఉత్సవ కమిటీకి పోషకులు మద్రాసు గవర్నరు శ్రీ శ్రీప్రకాశ, అధ్యక్షులు మద్రాసు ఆర్థిక మంత్రి శ్రీ సి. సుబ్రమణ్యం. ఇండియా, రష్యా, అమెరికా, జర్మనీలలో తయారైన చిత్రాలు 30 కి పైగా ఈ ఉత్సవంలో ప్రదర్శించబడ్డాయి. మద్రాసులోని 6 థియేటర్లు బాలచిత్ర ప్రదర్శనకు నియోగించబడ్డాయి. 8 మొదలు 12 సంవత్సరాల వరకు వయసుగల బాల బాలికలు ఈ చిత్రాలను చూశారు.

*   *   *   *

ఫిబ్రవరి మాసంలో ఆంధ్ర అంతటా జరిగిన ఎనికలలో 196 స్థానాలకుగాను 119 మంది కాంగ్రెసు అభ్యర్థులూ, 22 మంది కృషికార్ లోక్ పార్టీవారూ, 5 గురు ప్రజాపార్టీవారూ, 15 మంది కమ్యూనిస్టులూ, 13 మంది ప్రజాసోషలిస్టులూ, 22 మంది స్వతంత్రులూ ఎన్నిక అయినారు. 16 మాసాలక్రితం ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డాక ఇదే తొలి సర్వవ్యాప్త ఎన్నిక.



# చిత్రకథ



ఒకరోజున దాసూ, వాసూలనూ, కొందరు విద్యార్థులనూ పంతులు ఊరి బయట పాడుపడిన కోటప్రాంతానికి తీసుకుపోయాడు. ఒకప్పుడు ఆ కోట ప్రాంతాన్ని ఒక రాజవంశం పరిపాలించిందనీ, ఇప్పటికీ ఆ ప్రాంతాన తవ్వితే రాగిశాసనాలూ, వెండి బంగారు నాణాలూ దొరుకుతవని చెప్పాడు.




పంతులు చెప్పినదంతా శ్రద్ధగా విన్న దాసూ, వాసూలు మరునటిరోజున పలుగూ పారా తీసుకుని ఆ ప్రదేశానికి వెళ్లారు. అక్కడ తవ్వి, వీలయితే వెండిబంగారు నాణాలనుగాని, రాగిశాసనాలనుగాని సంపాయించాలని వాళ్ల ప్రయత్నం. కాని వాళ్ళశ్రమకు లభించినదిమాత్రం 'టైగర్'కు పనికివచ్చే బొమికె ఐంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

కూసు విద్య

పంపినవారు :
సి. సూర్యరావు - గొల్లప్రోలు

